

నటి రాజశ్రీ (ప్రభాకర్)

# తప్పకచూడండి

అన్ని కేంద్రములలోనూ దిగ్విజయ
యాత్ర చేస్తున్న నేటి ఉత్తమ చిత్రం!

బాక్స్ ఆఫీసు చిత్ర నిర్మాత
ఎస్.డి.నరంగ్ నిర్మించిన

# షెహనాయ్

(హిందీ)

పూర్తి ఈస్ట్మెన్ కలర్ చిత్రం

రాజశ్రీ.. బిశ్వజిత్.. జానీవాకర్.. రహిమాన్.
నిరూపరాయ్.. ప్రవీణ్ చౌదరి, మొ॥

దర్శకత్వం.. ఎస్.డి.నరంగ్
సంగీతం... రవి

పూర్ణా రిలీజ్...
(హక్కుదారులు.. సుభద్రా పిక్చర్సు మద్రాసు)

# ఉత్తరాలు

## ముఖచిత్రం

14—8—64వ తేది స్వాతంత్ర్య దినోత్సవ ఆంధ్రపత్రిక సంచిక కీ. శే. వ్రాహాగారి ముఖచిత్రము ప్రత్యేక ఆకర్షణీయముగా నున్నది. మనసున మల్లెలు సీరియల్ సమాప్తము అయిన వెంటనే మరియొక సీరియల్ వెనువెంటనే ప్రచురించిన ఎడిటర్‌గార్కి నా వందనములు పాఠకుల మా్రరూత లూగించిన మనసున మల్లెలు అను చక్కని సీరియల్ అందించిన రంగధామ్ గార్కి నా వందనములు. పత్రిక చాల బ్రహ్మాండముగా నున్నది, సీరియల్స్‌ను విడివిడిగా ప్రచురిస్తున్నందుకు ఎడిటర్‌గార్కి నా వందనములు.

చిర్ల సుబ్బారెడ్డి (గొల్లమామిడాడ)

*   *   *

ఈ వారం ముఖచిత్రం మీద మన భారత భాగ్య విధాత శ్రీ "వ్రాహా" గారి బొమ్మలోపల పేజీలలో మా అభిమాన నటుడు "ఎన్. టి. రామారావు" గారి జాతకఫలం ప్రచురించి మమ్మలను ఆనంద డోలికలతో వూగించారు. అందుకు మీ పత్రికకు నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

పి. హరి గోపాలరావు (తణుకు)

*   *   *

ఇందిరా గాంధీ చిత్రం తో 7—8—64వ సంచిక ముఖచిత్రంగా ప్రచురించి నందుకు, ఆమె జీవిత విశేషాలు గురించి ప్రత్యేక వ్యాసం ప్రచురించి నందుకు, మా (మీ) పత్రికకు నా అంతరంగిక ధన్యవాదాలు.

వేమూరి జగన్నాథం (ఖడ్గపూర్)

*   *   *

7—8—64. తేదీ పత్రిక ముఖచిత్ర ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కూడా కలుగ జేసింది. ఎల్లప్పుడు సినీ తారల చిత్రములేగాక ప్రముఖ రాజకీయవేత్తలు, ఇతర రంగములలోని ముఖ్య రంగములలోని ముఖ్య కళాకారుల ముఖచిత్రములతో పత్రికను మరింత శోభాయమానముగ వెలువరించెదరని భావిస్తున్నాను.

'మురళి' (మూసేపల్లి)

## సీరియల్ కథలు

'రంగధామ్' గారి 'మనసున మల్లెలు' చాలా బాగుంది. కాని దాంట్లో రామారావు, విమలల సంగతి ఏమైంది ? వారికి వివాహం జరిగిందీ లేనిదీ మాకు అర్థం కాలేదు. అసలు ఈ వారం దాంట్లో వాళ్ళ సంగతే రాలేదు. వాళ్ళ సంగతి మాకు సస్పెన్సులో ఉంది. అది తెలియ చెయ్యడం రంగధామ్ గారు మరచిపొయ్యారేమో ?

పి. భగవాన్‌కృష్ణ (కాకినాడ)

*   *   *

'కూలినగోడలు'_ మొదట్లో కంటే చివరి భాగంలోనే చదువరులకు ఉత్సాహాన్ని కలిగిస్తున్నది. అయితే రచయిత్రి వాడిన— కొన్ని ఎబ్బెట్టైన పదాలవల్ల, పాత్రల ఉన్న తత్వము చెడిపోతున్నది. ఉదా : 24—7—64 సంచికలో 25వ పేజీలో రెండవ కాలం 8వ లైను : "ఖర్మ ! జానేదేవ్ ఏమిటీ ఖర్మ. . . ." మధు పాత్ర ద్వారా ఈ మాటలు రచయిత్రి పలికించడం సబబుగా లేదు. మధుకు చిన్నప్పటి నుండి సుందరమ్మగారిపై గౌరవము— భక్తి ఉన్నట్లు రచయిత్రి ఇదివరలో పాత్రల ద్వారా స్పష్ట పర్చారు. "నీ ఖర్మకు నీవు. . . ." సుందరమ్మగారన్న మాటలకు— పై పలుకులు మధు అనడంలో ఎంత వరకు సమంజసం ? ఆ పలుకులు అగౌరవంగా కూడ ఉన్నవి. సహజంగా ఉద్వేగమైన పాత్రలను సృష్టిస్తున్నప్పుడు రచయితలకు రచయిత్రులకు ఉద్వేగం కలగవచ్చు. ఆ ఉద్వేగంలో ఎబ్బెట్టైన పదాలు దొర్లవచ్చు. ఈ 'జానేదేవ్' అన్న హిందీ పదం కూడా అలాగే దొర్లి ఉండవచ్చు. (?) అదే సంచికలో 40వ పేజి, మొదటి కాలంలో 45—46 లైనులో— "నువ్వు ఏ పాపము చేయలేదనేనా నీ అహంకారం ?. . . ." ఈ పలుకులు ఇందిర నోటి నుండి మధును గూర్చి వెలువడినవి. మధు ఇందిరల మధ్య ఎంతో ప్రేమానురాగాలు ఏర్పడినట్లు మొదట్లో స్పష్ట మవుతుంది. భగవంతుని గూర్చి జరిగిన వాగ్వాదపు ఉద్వేగంలో ఇందిర మధునలా అనడంలో ఆ పాత్రకే వెలుగు నశించింది. రచయిత్రి 'అహంకారం' అని వాడకుండా ఉంటే బాగుండేది. 31—7—64 సంచికలో 46వ పేజీ, 3వ కాలం 48—49 లైనులో— ". . . నువ్వు మగవాడివి. మగవాడి లాగే ప్రవర్తించావు. . . ." కేశవరావును మధు అన్న ఈ పలుకుల్లో ఎంతో అగౌరవం ద్యోతకమగుచున్నది. డాక్టర్ గారిని వినయంతో గౌరవించే మధు "నువ్వు" అని ఎలా సంబోధించ గలిగాడో

పి. ఎస్. వి. రెడ్డి (అలువాల) ★

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### నోటీసులు అంటించరాదు

ఇచ్చట ఫలానాది అమ్మబడును
అనే ప్రకటన మనచేత నమ్మబడును
కొనడానికెళితే తీరా
ఘోషించినది టిన్ తేరా
స్టాంపు వెండరు ఇంటిముందున్న ప్రకటన బల్ల
అక్కడ విక్రయిస్తుందా మనకు తపాలా బిళ్ల !

### ఇచ్చట పుట్టిన చిగురు కొమ్మైన చేవగరు

ఎన్నడేనా జార్జి బెర్నార్డ్ షా
ఎక్కాడా సైకిల్ రిక్షా
ఎన్నడేనా సోమర్ సెట్ మామ్
తిన్నాడా గులాబ్ జామ్
ఏనాడైనా జే. బీ. ప్రీస్ట్లీ
ఏది కొనబోయినా అయిందా కాస్ట్లీ
గొప్పవాడా జేమ్సు తర్బరు
ఎప్పుడేనా అతడి తలను పావనం చేశాడా తిరుపతి బార్బరు
వీళ్ళకన్నా గొప్పవాళ్ళే ఇండియాలో వాళ్ళు
వీళ్ళిక్కడ పుడితే మాత్రం పొగడవు మా నోళ్లు
ఇండియాలో వున్నా రుడ్‌యార్డ్ కిప్లింగు
ఎన్నడూ చేయలేక పోయాడు సాహిత్య స్మగ్లింగు! ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 4—9—'64
క్రోధినామ సం॥ శ్రావణ మాస బ॥ త్రయోదశి
సంపుటము 57 సంచిక : 1

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్ జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"మద్రాసులో భిక్షం వృత్తి నిషేధిస్తారట! ఏం సంగతి?"
"ఓయబ్బ! ఆరోజే వస్తే, బిచ్చం బదులు అప్పులు అడగొచ్చు"

## మనలో మాట

పోయిన సారి వినాయకచవితి ప్రత్యేక హాస్య సంచికను నూరు పేజీలతో ఏభై పైసల వెలకు వెలువరించామన్న సంగతి పాఠకులకు జ్ఞాపకం వుండే ఉంటుంది. ఈసారి కూడా హాస్య సంచికను ప్రత్యేక సంచికగా వెల ఏభై పైసలకు వెలువరిస్తున్నాము. పై వారం సంచికయే [11-9-64] ఆంధ్ర సచిత్ర వార పత్రిక జన్మదిన సంచిక కూడా. పై వారం వారఫలం కర్త శ్రీ మహేష్ రాసిన ఒక ప్రత్యేక వ్యాసం వేస్తున్నాము. త్వరలోనే శ్రీ మహేష్ చేసిన మరొక ముఖ్యనటుని జాతక సమీక్ష కూడా వేద్దామనుకుంటున్నాము.

* * *

సాధారణంగా రచయితలకు మనవి అంటూ ప్రతి సంచికలో ఎక్కడో అక్కడ కొన్ని నిబంధనలు వేస్తూనే వుంటాము. కాని రచయితలు వీటిని అంతగా గమనిస్తున్నట్లు తోచదు. తమ రచనల విషయంలో పంపించిన మలి రోజునించి ఉత్తరాలు రాస్తారు కొందరు. కొందరు రచనలతో పోస్టు కార్డు జతచేస్తారు. రచన ఆమోదం పొందితే మేమే తెలియచేస్తాము. రచన అందిన వైనం వారుపంపే కార్డులపైగాని యితర్రతా గాని వారికి తెలియబరచలేము. రచయితలు ఆమోదం పొందని తమ రచనలు తిరిగి పొందే టందుకు పోస్టేజీ పంపితే చాలు. దరిమిలాన ఉత్తరాలు రాయడం వల్ల ప్రయోజనం వుండదు. పోతే రచయితలతో వారి రచనలను గురించి చర్చించడంగాని, ఉత్తరప్రత్యుత్తరాలు జరుపగలగడం గాని సాధ్యం కాదని మనవి.

వినాయకచవితి సంచికకు ప్రత్యేకంగా అనుకున్నకంటే ఎక్కువ మంది రచయితలు ఉత్సాహంగా తమ రచనలు పంపారు అందరికీ మా కృతజ్ఞత.

* * *

28, 29 పేజీల్లో వేసిన 'దశావతారా'లు తిరుచ్చి జిల్లాలోని అరియలూర్ లోని కోదండరామస్వామి ఆలయంలోని 'శిల్పాల' వని తెలుస్తోంది. ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : యల్. విజయలక్ష్మి ప్రత్యేక చిత్రం. (ఫోటో : ప్రభాకర్)

# సిరిటోన్

## ఆరోగ్యాన్ని, బలాన్ని చేకూర్చుకునేందుకు

కోల్పోయిన ఆరోగ్యాన్ని, శక్తిని చేకూర్చుకునేందుకు సిరిటోన్ ఎంతో ఆహ్లాదకరమైన పానీయము. చేతితో తాకకుండానే అతి పరిశుద్ధంగా, బార్లీ మాల్టు, మీగడ పాలు, కోకోలతో అది తయారు చేయబడింది. ఇవేగాకుండా యిందులో దేహదార్ఢ్యతకూ, శక్తికీ అత్యవసరమైన విటమిన్లు, ఖనిజలవణాలుకూడ ఉన్నాయి.

వేడిగానైనా, చల్లగానైనా, సిరిటోన్ ఎప్పటికప్పుడే కలుపుకోవచ్చు. పిన్నలకూ పెద్దలకూ, ఆరోగ్యవంతులకూ అనారోగ్యవంతులకూ, శక్తిహీనతను నిర్మూలించటానికి సిరిటోన్ వరప్రసాదంలాంటిది.







తయారు చేయువారు:
సౌత్ ఇండియా రిసర్చి ఇన్‌స్టిట్యూట్ ప్రయివేట్ లిమిటెడ్
విజయవాడ - 7.

POLAR TE 53


ఎంత ప్రయత్నించినా
కారు కదలటం లేదు!
ఆహార పదార్థాల ధరల తగ్గింపు పథకం


పిల్లి-ఎలుకా
తప్పించుకోటానికి మా మార్గాలు మాకున్నాయ్!
దొంగనిల్వదారుడు
కాంగ్రెస్ కార్యవర్గం


చైనాకు వంతపాట!
అక్సాయిచిన్ ఇండియాకన్నా చైనాకే ఉపయోగం
జయప్రకాష్‌నారాయణ్


కమ్యూనిస్టుల సమ్మెబెదిరింపు
బాధలుపడుతున్నప్రజలు
OOMMEN

# మరే టార్చీ ఏండ్ల తరబడి ఏ చిక్కూ లేకుండా పని చేయదు




ఈ 'ఎవరెడి' టార్చిలైటు కూడా రకరకాల ఇతర 'ఎవరెడి' టార్చిల లాగే చాలాకాలం మన్నేలా చేయబడింది. దాని అతుకులేని దళసరి అల్యూమినియం గొట్టం స్టీలుకంటే చాలా శ్రేష్ఠమైంది. దృఢంగా వుండి చాలాకాలం మన్నుతుంది. ప్రపంచ ప్రఖ్యాతి బడసిన 'ఎవరెడి' లాక్-స్విచ్ చాలా నమ్మకంగా పనిచేస్తుంది. స్విచ్ నొక్కితే చాలు ఉజ్వల కాంతి కిరణాలు సూటిగా పడ్తాయి. ఏలనవ 'ఎవరెడి' ప్రీఫోకస్ట్ బల్బు, దానితో సరితూగేలా శాస్త్రీయ పద్ధతిని మెరుగు తగ్గని, త్రుప్పుపట్టని దీటైన అల్యూమినియం పూతపూసిన నాణ్యమైన రిఫ్లెక్టరు వున్నాయి. దీని బల్బు ఓ స్పెషల్ షాక్ ఎబ్జార్బర్‌పై వున్నందున గట్టిదెబ్బ తగిలినా, క్రిందపడినా చెక్కుచెదరదు.

నేడే యీ 'ఎవరెడి' టార్చిని కొనండి—మీ పెట్టుబడికి తగిన విలువ.

# ఎవరెడి

టార్చిలు • బ్యాటరీలు • బల్బులు • మ్యాంటిల్సు

UNION CARBIDE యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్

# కార్యసిద్ధి

ముద్దా శాస్త్రిబాబు

## 22

ఒక రోజున గణేశుడు కైలాసంలో ముని కుమారులతో ఆడుకుంటూ ఉండగా, ఒక చిత్రం, జరిగింది. అందరూ కలిసి ఇవాళ దేవుడాట ఆడుతున్నారు. అందుకోసమని అంతా కలిసి పత్రీ, పువ్వులూ, ఆకూ, అలమూ పోగుచేసి తెచ్చారు. కొండంత దేవుడికి కొండంత పత్రి అన్నట్టు, ఒక పర్వతమంత మేట వేశారు !

అయితే—

ఆటలో దేవుడు ఎవరూ?— అన్న ప్రశ్న వచ్చింది. నేను దేవుడంటే నేను దేవుడని ముని కుమారులంతా పోటీలుపడి, గోలచేశారు. అప్పుడు వినాయకుడు కలగజేసుకున్నాడు—

"అలాక్కాదు. ఇదిగో, నే చెప్పేది వినండి : అసలు దేవుడనేవాడు ఎలా ఉంటాడో మీ కెవళ్ళకైనా తెలుసా?— రాయిలాగా ఉంటాడు.!— అంటే కదలక, మెదలక ఉండాలి. ఎత్తయిన రాతి మీద అలానే కూచుని ఉండాలి. మరి, ఇందుకోసమని మీలో ఒకరు పోయి, అదుగో ఆ కొండమీద కనబడే పెద్ద రాతిబండని అమాంతంగా రెండు చేతులతోను ఎత్తుకు రావాలి. మరి, ఈ పని చెయ్యగలవాళ్ళెవరో చేతులెత్తండి !"—

అనేసరికి ఒక్కడూ చెయ్యెత్తలేదు సరికదా అంతా తెల్ల మొహాలు వేశారు. కానీ ఒక్కడు మాత్రం ముందుకు వచ్చి, 'నే తెస్తా !' అన్నాడు, ధీమాగా. •

"భేష్, నువురా వీరుడివి! బలేవాడివి !! అన్నట్టు నీ పేరేమిటి ?" అని అడిగాడు, గణేశుడు.

"నాపేరూ?.........వూఁ — దేవ—కు—మా—ర........"

"బాగా వుంది ! నీకు దేవకుమారుడనే పేరు ఎంతో బాగానే ఉంది. నిజానికి, నీ పేరులోనే కనిపిస్తూవుంది, నీ శక్తి. వెళ్ళు, ఆ రాయి పట్టుకురా, చూద్దాం ! అయితే— దాన్ని కింద మట్టుకు పెట్టకూడదు సుమా ! రెండు చేతులతోనూ పైకెత్తి పట్టుకు రావాలి !

'ఓస్, దీనికేముంది !' అంటూ దేవ కుమారుడు వెళ్ళి ఆ బండను అమాంతంగా మోసి తీసికు వచ్చాడు. ఇది చూసి అంతా ఆశ్చర్యపోయారు. దేవ కుమారుణ్ణి దేవుడిగా చేసి, ఆ బండరాతిమీద స్థాపించారు.

వినాయకుడు 'వూఁ !—' అనడమే తడవుగా వూపిరాడకుండా పూజచేశారు.

పత్రితో, పువ్వులతో పూజ జరిగిన తరవాత గణేశుడు, 'చూడండి! మన దేవుడు సామాన్యుడు కాడు. ఒహ్మోండమైన రాతినే అమాంతం మోసుకు వచ్చేశాడే!— అంటే, ఈ దేవుడికి రాళ్ళు ఎంతో ఇష్టంమన్నమాట. కనుక, మనమంతా రాళ్ళు పోగుచేసుకునివచ్చి, భక్తికొద్దీ వాటితో పూజచేస్తే మన దేవుడు సంతోషిస్తాడు !' అని చెప్పాడు.

ఈ మాట వినాయకుడి నోట వచ్చిరావడంతోనే పెద్ద రాళ్ళగుట్ట ఒకటి అక్కడ తయారైపోయింది. చూస్తూండగానే ఆ గుట్ట గుట్టంతా దేవకుమారుడిమీద పోగుపడింది. !

మునికుమారులు రాళ్ళపూజ చేస్తూ వుండగా, బాధకు తట్టుకోలేక, పువ్వుల గుట్టలోపలినించి పెద్దగా మూలుగు వినబడింది !

మరి కాస్సేపటికి ఆ గుట్టలోనుంచి ఒక భయంకరమైన రాక్షసాకారం 'గణా ! గణా !!' అంటూ వెలువడి, మహా వృక్షంలాగా విరమకు పడిపోయింది !!!

ఆ రాక్షసుడే మన చంచలాసురుడు. అతని మాయోపాయాలు గణేశుడిముందు పనికిరాలేదు. పైగా, చంచలాసురుడు ఎదటి బలం ఎరుగకుండా కోరి వెళ్ళి, తనకే ముప్పు తెచ్చుకున్నాడు !"

ఈ కథచెప్పి, శుక్రాచార్యుడు ఆనాటికి సెలవు తీసుకు వెళ్ళిపోయాడు.

సింధురాజు పెద్దగా నిట్టూర్చాడు !

## 23

'ఏమిటీ చిత్రం ! సరిగా బొడ్డయినా వూడని వాడు !— ఇంతమంది రాక్షస వీరుల్ని పొట్టబెట్టుకోవడమా?— కుర్రవాడిపైన కత్తిగట్టి, నేనై వాడిని యుద్ధరంగంలో ఎదుర్కోవటమా? ఛ !— ఇటువంటి పని నాకే సిగ్గుచేటు, నాకే తలవంపులు' అని ఈ విధంగా మథనపడుతున్న సింధురాజు సమక్షానికి మంత్రులు యావన్మందీ వచ్చేశారు.

"ఏం?— ఆ కుర్రవాడిని కడతేర్చే మార్గం మరేదీ కనిపించలేదా?" అని కఠినంగా, నిష్కర్షగా ప్రశ్నించాడు, సింధురాజు.

"లేకేం, ప్రభూ !— అందుకోసమనే మేమూ అహోరాత్రాలు వెతుకుతున్నాం. మాయోపాయాలు తెలిసిన మహామహిమాలను ఎందరెందరినో రప్పించాము. కైలాసానికి పంపించాము. అంతా అక్కడికి వెళ్ళినవాళ్ళేగాని, తిరిగి వచ్చినవాడొక్కడూ కనిపించడు. ఈ వార్తలు రాజ్యమంతటా పాక్కిపోయాయి. ఇటువంటి పరిస్థితుల్లో ప్రజలు ప్రభు దర్శనానికి రావడానికే భయపడుతున్నారు........" అని విన్నవించారు.

"ఎందుకీ సోది ! ఇప్పుడు మీరు చెయ్యదలచింది ఏమైనా ఉందా? లేదా?" అని ఖచ్చితంగా అడిగాడు మహారాజు.

"ఆ సంగతి మనవి చేద్దామనే వచ్చాం ప్రభూ ! ఇప్పుడు మనకు రెండే రెండు మార్గాలు కనబడుతున్నాయి. మొదటిది యుద్ధరంగంలో ఆ కుర్రవాడికి తగినట్టు సమాధానం చెప్పడం. లేదా, రెండవది, రాజీ యత్నం..........."

సింధు మహారాజు ఉగ్రుడయ్యాడు !

"చాలు, చాలు, మీ సలహా. చూడగా మీరు మా వంశానికే అపప్రతిష్ఠ తెచ్చేట్టున్నారు. వ్యవహారం ముదిరి ఇంతవరకూ వచ్చాక, ఇంకా రాజీ ఒకటా? రాజీ !!— ఇలాంటిమాట ఇప్పుడంటే అన్నారుగానీ, మరెప్పుడూ నోట రానివ్వకండి. వెళ్ళండి !!"—

అనిచెప్పి చీకాకుతో వాళ్ళనిపంపివేశాడు.

*   *   *

శుక్రాచార్యుడు సింధురాజుతో చెబుతున్నాడు, సింధురాజు వింటున్నాడు—

"రాజా !— విను :

ఈ రోజున కైలాసంలో గొప్ప కోలాహలం జరిగింది !— మహర్షులూ, దేవగణాలూ, అందరూ కలిసి, బ్రహ్మదేవుణ్ని వెంటబెట్టుకు మరీ వచ్చారు. కైలాస గిరికి. అటు వైకుంఠంనించి లక్ష్మీదేవి దిగివచ్చింది.

అక్కడ కూడిన సమస్త జనులూ పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ—

"మహానుభావా !— కైలాసవాసా !— ఇంకా ఎంతకాలం మేం ఓరిమి పట్టాలి? మేం అనుభవించవలసిన కష్టాలు ఇంకా మిగిలిపోయాయా దేవా?— తండ్రులొక దగ్గర, భార్యాబిడ్డలొక దగ్గర, ఎవరికి వారే యమునాతీరే అన్నట్టు విడిపోయి, ఒకళ్ళకోసం ఒకళ్ళం, ఇంకెంతకాలం ఇలా అలమటించి పోవాలి? స్వామీ !— ఆ సింధురాజు రాక్షసుడు మాత్రమేనా నీ భక్తుడు ? మేము నీ భక్తులం కామా? మామీద దయలేదా? మా గతి ఇంతేనా? అని అందరూ ఏక కంఠంతో ఘోషించారు.

లక్ష్మీదేవి పార్వతి పక్కన చేరింది. పార్వతి చేతిలో ఉన్న ముద్దుల బాలుడు గణేశుడ్ని తన ఒళ్ళోకి తీసుకుంది. పసివాణ్ణి ప్రేమతో నిమిరింది.

'అక్కా !— ఎంతకాలమే ఇంకా నాకీ చెరసాల ? ఆ నాడు నీ నాథుడు పోయి, గజాసురుడి గర్భంలో దాక్కున్నప్పుడు నువ్వెంత కలవరపడ్డావో, ఎంత బాధపడ్డావో ఇప్పుడు నాకు తెలిసివస్తూంది. ఇలా ఎంత కాలమే సహించడం, అక్కా?'— అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకు చెప్పింది, పార్వతితో.

అప్పుడు పార్వతి, లక్ష్మి కళ్ళనీళ్ళు తుడుస్తూ భర్తవేపు చూసింది.

పరమేశ్వరుడు చిరునవ్వు నవ్వి, 'దేవీ ! ఎవడైతే తన కష్టాలు తీర్చగలడో, వాడిని వస్తూనే చేరదీసుకుంది మీ సోదరి. ఇంక నేను చెయ్యవలసిందేమీలేదే !' అన్నాడు.

ఈ మాటకు అందరి దృష్టి గణేశుడిమీద పడింది !— లక్ష్మి ఒళ్లో కూచున్న బాల వినాయ కుణ్ణే కనురెప్ప వాల్చకుండా చూస్తూ :

"సృష్టి స్థితి లయమ్ము లెవంబుంచి లోకము
లంయమ్ము బాలించు వాదిమూర్తి,
సచరాచరాఖిల జగములందున నిండి
సర్వమును ప్రేమించు సౌమ్యమూర్తి,
సచ్చిదానందమూర్తి, భాస్కర సహస్ర
మహిత తేజోవిరాజితాపూర్వమూర్తి,
ఆర్తిహరణ పరాత్పరమూర్తి !— నీకు
తెలియబడని రహస్యంబు లెందుగలవు?—"

"సుతేసుభూనా, గుజ్జు రూపా !— దుష్ట శిక్షణ, శిష్ట రక్షణచేసి మమ్మల్ని కాపాడు !— ఇక జాగు చెయ్యకు. లే ! లే!!— అస్త్రాలు చేత పట్టు, ఎలుక వాహనం ఎక్కు. వూఁ !— బయ ల్దేరు !!!—" అంటూ వినాయకుణ్ణి వేగిరపెట్ట సాగారు.

వెంటనే విశ్వకర్మ వచ్చాడు. సూర్యభగవానుడి కిరణాంతో తయారుచేసి ఉంచిన రకరకాల ఆయుధాలన్నీ వినాయకుడికి బహూకరించాడు. ఆ ఆయుధాలను అందుకుంటూనే లక్ష్మి ఒళ్లో నుంచి గణేశుడు గభీమని ఒక్క గెంతు గెంతాడు !

తిన్నగా వెళ్లి తలిదండ్రులకు నమస్కరించాడు. ముద్దుల బాబుణ్ణి చేరదీసుకుని పార్వతీ పరమేశ్వ రులు అక్కున అదుముకున్నారు. తరవాత వినా యకుడు లక్ష్మీదేవికి వినయంగా ప్రణామంచేశాడు. ఆమె ఆశీర్వదించింది.

# కార్యసిద్ధి

ప్రమథగణాలందరూ ప్రత్యేక ఆయుధాలూ, అస్త్రాలూ గణపతికిచ్చారు. వాటన్నింటినీ వినా యకుడు తన నాలుగు చేతులతోనూ పట్టుకుని, ఎలుక వాహనంమీద ఎక్కాడు. నందీశ్వరుడు తోడురాగా, బాల వినాయకుడు బయల్దే........'

అని శుక్రాచార్యుడు మాట పూర్తిచెయ్య కుండానే, సింధురాజులో ఆకస్మికమైన మార్పు వచ్చింది. ముఖం వెలవెలబోయింది !—

గురువుకదా అన్న గౌరవం లేకుండా, మర్యాద కోసమైనా మాట వినిపించుకోకుండా, చివాల్న లేచి, అంతఃపురంలోకి వెళ్లిపోయాడు, సింధురాజు.

* * *

"అనలా !— స్థితి విషమించింది. ఇప్పుడు నువ్వు తప్ప నన్ను ఆదుకునే వాళ్లు లేరు. నా చుట్టూ చేరిన ఈ ముఠా వాళ్లంతాదరూ నా ఎదుట ముఖస్తుతిచేసి, వెనకాల గోతులు తవ్వే బాపతు. ఎంతమాత్రం నా క్షేమం కోరే వాళ్లు కాదని తెలిసి పోయింది. కనుక వాళ్లమీద ఆశపెట్టుకోవటం వృథా.

"ఇదుగో అనలా !— నా రాజ్యంలో నువ్వే సైన్యాధిపతివి, నువ్వే సర్వాధికారివి. నువ్వే సమ స్తమూను. కావలసిన సైన్యం తీసుకో. ఇష్టం వచ్చినంత ధనం తీసుకో. ఏమీ సందేహించకు మనకు విజయమే ప్రధానం. నీ శక్తిసామర్థ్యాలు నాకు తెలుసు. మన మీదికి దండెత్తి రాబోతున్న ఆ కుర్రవాడికి సమాధానం చెప్పగలవాడివి నువ్వు ఒక్క డివే. లే !— ఇదుగో ఖడ్గం !!— అదిగో సేనలు ! రథం సిద్ధంగావుంది." అంటూ, సింధురాజు అనలాసురుణ్ణి బయల్దేరదీశాడు.

అనలాసురుడు తయారై, రథం ఎక్కాడు !

* * *

ముమ్మరంగా సాగుతూ వుంది యుద్ధం ! దేవగణాలు రాక్షసగణాల్ని గట్టిగా ఎదుర్కొన్నాయి. కత్తికి కత్తి, తలకి తలా, కాలికి కాలూ, చేతికి చెయ్యీ, సరిగా సమాధానం చెప్పాయి. రాను రాను రాక్షస బలగం పలచబడసాగింది. దేవగణాలు ముందుకు చొరుచుకుని వచ్చాయి.

చూడగా, అనలుడికి నిబ్బరం తగ్గింది. ఇది పనికాదని గణేశుడిమీద రుధిరాస్త్రం ప్రయో గించాడు. అనలుడి చేతిలోంచి బయల్దేరిన ఆ అస్త్రం రివ్వుమంటూ పోయి, గణేశుడి అమ్మరి పొదిలో దాక్కుంది !

'ఓహో, నీ సంగతిలా ఉందా' అని, రక రకాల ఆకారాలు దాలుస్తూ ఇంద్రజాల యుద్ధం చేశాడు. అనలాసురుడు. తనకు చేతనైనన్ని మాయ లూ, మహిమలూ చేసి చూపించాడు !

అప్పుడు గణేశుడు శక్తివంతమైన ఆగ్నే యాస్త్రాన్ని ప్రయోగించాడు !

అయితే, అనలాసురుడు అసలు అగ్నిహంశతోనే పుట్టినవాడాయె ! అందుచేత ఆగ్నేయాస్త్రం అన లుణ్ణి ఏమీ చెయ్యలేకపోయింది. వినాయకుడు చేసిన ఈ పనికి అనలుడు వికటంగా నవ్వాడు !—

ఆ నవ్వుచూసి వినాయకుడు అంతకంటే వికటం టంగా నవ్వాడు ! నవ్వుతూ, రథంమీదినించి మెల్లిగా కిందికి దిగి, ద్వంద యుద్ధానికి సిద్ధ మయ్యాడు 'అరే, కాసుకో !' అంటూ అమాం తంగా మీదికి కురికాడు, అనలుడు.

గణేశుడు అనలుణ్ణి రెండు చేతులూపట్టి, గిరగిర తిప్పి తిప్పి, నేలకేసి కొట్టాడు. మరి లేవ టానికి వీలులేకుండా కాలితో నొక్కి పట్టాడు. అలా పట్టేవుంచి, అనలుడి గుండెలు నిలువునా చీల్చి వేశాడు ! నిప్పుకణాల్లాగా నిగనిగ మెరుస్తూ, సెగలు గక్కుతున్న అతని గుండెకాయను పైకి తీసి, గుటుక్కున మింగివేశాడు !—

లోక కళ్యాణం కోసమని అనలుడి గుండెకాయను ఇలా మింగివేశాడే కాని, ఆ తాపానికి తట్టుకోలేక, వినాయకుడు మూర్ఛపోయాడు !

ఇదిచూసి ప్రమథ గణాలు బెంబే లపడిపోయారు. సమస్తమైన శైత్యోపచారాలు చేశారు. కాని గణే శుడు ఎంతకూ మన స్మృతిలో పడలేదు.

అప్పుడు నందీశ్వరుడు , "మీరంతా తలా ఒక్క దిక్కుకూ పోయి, ఈ సింధూనది ప్రాం తంలో దొరికే గరికపోచలు లెక్కగా ఇరవై ఒక్కటి చొప్పున ఒక్కొక్కళ్లూ తీసుకురండి !" అని చెప్పి పంపాడు.

ఆ ప్రకారం అంతాపోయి, గరికపోచలు తెచ్చారు. వాటితో వినాయకుడి శరీరమంతా కప్పగానే, కాస్సే పటికల్లా గణేశుడు తేరుకున్నాడు !

ముల్లోకాల ప్రజలూ ఎంతగానో సంతో షించారు !!—

48 వ పేజీ చూడండి



# శ్రీవారితో సినిమాకి...

వినోదం కోసమయితేనేమి, కాలక్షేపానికి అయితేనేమి మరెందు కయితేనేమి (వ్యక్తిగతంగా) సినిమాకు వెళ్ళనివారు ఈ రోజుల్లో లేరనే చెప్పాలి. పట్టణం అనబడే ప్రతి పెద్ద వూరికీ ఒక సినిమా హాలు వుంది. ఇంచు మించు ప్రతీ ఇంటా ఈ సినిమా అభిమానులు ఒక్కరయినా వుంటారు.

ఎక్కువ ఇష్టం, చాలా డబ్బు, వున్నవాళ్ళు ప్రతి సినిమా ఊళ్ళోకి వచ్చిన వెంటనే చూసి ఆనందిస్తూ వుంటారు. మరి కొందరు విడుదల అయ్యే సినిమాలలో "ఇది చూడాలి" అనుకొని దాన్ని వీలున్నప్పుడు చూస్తూ వుంటారు. ఏదైనా సినిమా చాలా రోజులు ఆడుతూ, అది చాలామంది బాగుందని చూస్తూ చెప్తుతూ వుంటే చూసే వాళ్ళు కొందరు.

సినిమాలు ఎవరు ఎలా చూస్తారన్న సంగతి అలా వుంచి, హాలు నిండా వచ్చే జనం గురించి ఇప్పుడు మాట్లాడు కొందాము. అందులో — శ్రీవారు ప్రేమగా (చాలా వరకు ఒకరు) ఏదైనా సినిమాకు బయలుదేర దీసి నప్పుడు, లేదా మనమే శ్రీవారిని (మామూలుగా) సినిమాకు ఒప్పించి, వెళ్ళి నప్పుడు గమనించాల్సిన కొన్ని విషయాలు — నా యొక్క అనుభవం దృష్ట్యా చెప్పాలని బుద్ధి పుట్టి ఈ వ్యాసం వ్రాస్తున్నాను. ఎందుచేతనంటే, మనం సినిమా సరదా కోసం, సంతోషంగా ఒకొద్ది సేపు ఇంటి విషయాలు అవీ మరచి పోదామని వెడతాము. కాని, తీరా సినిమాకు వెళ్ళాక, సినిమా హాలులో లేటి ప్రేక్షకుల వల్ల, మరికొన్ని కారణాల చేత సినిమాకు వెళ్ళిన సంతోషం లేక, ఎందుకు వెళ్ళాము రా బాబూ అనిపించేటట్లు జరుగుతుంది.

సినిమాలంటే ఎక్కువ ఇష్టం వున్నవాళ్ళు, పత్రికల్లోను, వార పత్రికల్లోనూ, "త్వరలో విడుదల" "తయారవుతు" చూసిన దగ్గర నుండి ఆ సినిమా చూడాలనే కోర్కెతో సినిమా ఊళ్ళోకి వచ్చిన తర్వాత, శ్రీవారు సరదాగా వున్నప్పుడు, మనకు మంచి సమయం దొరికి నప్పుడు ఆయనని అడగడం జరుగుతుంది. ఆయన కొంచెం వ్యవహారం మనిషయితే "నిన్న నేనా చూసింది, చూద్దామంటే" అని అది చూద్దాం అనేవాళ్ళా, లేదా ఇంకో సినిమా వచ్చేదాకా వూరు కొంటారు. సరేలే అడిగారుకుంటాము అన్నా వూరుకోని విద్యు కుండా, శ్రీవారు ఆఫీసు కెళ్ళాక కబుర్లకని పక్కింటి పార్వతి అడగ కుండానే "నిన్న ఫలానా సినిమాకు వెళ్ళాం. ఎంత బావుందని!!! ఆ... నావు ఏక్షన్, ఆ పాట, ఆ డాన్సు" అని ఒక్కొక్కటి వూరించి చెపుతూన్నప్పుడు, సినిమా చూపించనందుకు, శ్రీవారి మీద, తనే మహా చూసినట్లు చెప్పే ఆవిడ మీద కొంచెం ఉడుకు మోత్తనం కల్గడం జరుగుతుంది. ఇక ఆవిడ ప్రసంగం అవ్వ చెయ్యడానికి, "మేము కూడా ఈవాళో, రేపో వెళ్ళాలను కుంటున్నాము — మీరు పూర్తిగా చెప్పే సేయకండి బాబూ, మేము చూసేటప్పుడు "సస్పెన్సు" "ఇంటరెస్టు" వుండదు." అని తప్పించుకో వలసి వస్తుంది. సరిపెట్టుకొని పోయే వారయితే ఆయన గారు తీసికెళ్ళేదాకా వూరు కొంటారు. లేదా "చూద్దాం అనుకొంటూ వుండేవే పోయింది." అని ఊరుకొంటారు. ఇలాగ కాక ఆయనతో మారాము చేసి పేచీలు తిని ఫలితం లేక పోయినప్పుడో, ఆయన అయిష్టంతో సినిమాకు వెళ్ళి, విధివశాత్తు ఆ సినిమా బాగుండక

## శ్రీమతి సుగుణ

పోతే మొదలయ్యే శ్రీవారి సణుగుడితో ఇంటికి తిరిగి రావల్సి వస్తుంది.

శ్రీవారికి సినిమాల పిచ్చి ఎక్కువై ప్రతి సినిమాకు తీసికెడతాముని (అనరు) అనే వారికి ఇది అన్వయించదు.

**అలాగే** సినిమాకు ప్రక్కింటి పిన్నిగారితోటో వెడతానని ఎప్పుడూ మనంతట మనం చెప్పగూడదు. దానివల్ల ఏ సినిమాకు ఎవళ్ళు కూడా తీసికెళ్ళక "ఆవిడతో వెళుదువు గానిలే" అని ఆయనంతట ఆయన మానే రావటం తప్పిస్తుంది. అలా పిన్ని గారితో సినిమాలకు వెళ్ళటం మనకు అంత ఆనందదాయకమైనది గాదు.

ఏమయినా, డబ్బు, సానుకూలం, సమయం చూసుకోకుండ సినిమాకు వెళ్ళటం (మనకు ఎంత ఇష్టం వున్నా) సంతోష మయినది గాదు.

2. ఇక "సినిమాకు పోదాం తయారుకా" అని శ్రీవారన్నప్పుడు తయారవడం గమనించాల్సిన విషయం. అలంకరణకు ఆడవారు 'ఆలస్యం అనే ప్రచారం మనకు ఎలాగూ వుంది. గనుక సినిమాకు వేళకో వెళ్ళడాన్ని మన తరఫున ఆలస్యం వుండ కుండా మనం చూసుకోవాలి. టిక్కెట్లు దొరకక సినిమా సగం ఆట అయిపోతే శ్రీవారు పెట్టే చివాట్లు మనకు తెలవు.

సినిమాకు సాధారణంగాను, శుభ్రమైన బట్టలు ఆభరణాలు వేసుకుంటేను చాలు. పట్టు చీరలు, పూర్తి నలువనీ, పెద్ద నగలు ఎక్కువట్టుగా వుండాయి. చీర కట్టుకున్నా నిండా కప్పుకొని వుంటే హుందాగా వుంటుంది. ఎక్కువ "మేకప్" "లిప్‌స్టిక్" లాంటివి తగిన అంతవరకు తప్ప బాగుండవు. అయినా మంచివి గావు.

చెప్పులు గూడ అవసాన దశలో ఇలాంటి అవసాంకోసమే ఎదురు చూస్తూ వున్నావని దారిలో తెగిపోయినాయి, కాని అప్పుడునుంచి అలవాటు

47 వ పేజీ చూడండి



"ఫ్యాషన్ షో" లకు యువతులను తర్ఫీదు చేసేటప్పుడు జర్మనీలో "మంచుపై నడక" లో గూడా శిక్షణ ఇస్తారు. వారు చదివే ఆ పుస్తకాలు తలపై అలా "బ్యాలన్స్" చేయడంవల్ల హుందాయైన నడకతోపాటు, శరీరంలో కలిగే అందమైన వంపులు వారి ప్రదర్శనలకు ఎంతో సహాకరిస్తాయి. (యు. పి. ఎస్.)

# ఆరువేల మైళ్ళు సైకిల్ మీద

# అబల సాహస యాత్ర!



"ముసుగు వేసుకోలేదని ఒక మత గురువు నన్ను రాళ్లతో కొట్టమన్నాడు . . . ఆ యువకులు రివురివ్వున రాళ్లు రువ్వారు!"

(గతసంచిక తరువాయి)

వాతావరణం ఇంకా బిగుసుకు పోయింది. రైళ్ళు నడవటం లేదు. ఏది రోడ్డో, ఏది కాదో తెలియకుండా ఎక్కడ చూసినా మంచు. అంతా అయిసు గడ్డలు గడ్డలు. 21 సంవత్సరాలు ఒక బృహత్పథకంలా ఈ యాత్రనే అనుకొన్న నాకు ఇంత దారుణమైన చలికాలం ఎన్నడూ తటస్థ పడలేదు. ఆ వాతావరణంలో సైకిలు తొక్కడం అనే ప్రశ్న లేదు. దాన్ని కూడా తీసుక వెళ్ల గలిగితే చాలు, ఏమయితేనేం అతి ప్రయాస మీద, కొన్ని మోటారు బండ్లలో కొంత దూరం ముందుకు కదిలాను.

నాకు సహాయపడ్డ 'వాన్' బండ్ల వాళ్లకి కూడా ప్రయాణం సునాయాసం ఏమీ కాదు. 'జాగ్రేప్' నుంచి 'బెల్‌గ్రేడ్'కు ఉన్న ఇంచు మించు 250 మైళ్ల దూరం నేనొక పెద్ద పదిటన్నుల ట్రక్కులో తల దాచుకొని ప్రయాణం చేశాను. దాన్ని నడుపుతోన్న వాళ్లు మంచి బలిష్ఠకాయులైన యుగోస్లావియులు. అయినా, మా ముగ్గురికి ఈ ప్రయాణం 39 గంటలు, ఒగకుండా చేస్తే పట్టింది.

మేం ట్రక్కులోనే నిద్రపోయి, ట్రక్కులోనే భోజనం చేశాం. అప్పుడప్పుడు గడ్డపారతో మంచు గడ్డలను తొలగించి దారి కూడా చేసికోవలసి వచ్చేది. మాకు దూరంగా మసక మసకగా; పొట్టి గుర్రాలు లాగుతున్న బళ్లు అగుపించేవి. మంచులో కూరుకు పోయిన మా లారీని అవసోపాలు పడుతూ బయటికి లాక్కుంటూ ఉంటే, మాకు పది, పదిహేను గజాల దూరంలోనే చిన్నచిన్న మందలుగా పారి పోయే తోడేళ్లు కూడా కనుపించేవి.

ఎట్టకేలకు 'బెల్‌గ్రేడ్' చేరుకొని అక్కడ రెండు రోజులు మంచుమాసి మార్గమేదైనా అగుపిస్తుందేమోనని నిరీక్షించాను. కాని, మూడు నాలుగు అడుగుల ఎత్తున రోడ్లమీద మంచు పేరుకు పోయి, నా ఆశను నిరాశను చేసింది. ఏం చేస్తాం! మళ్లీ ట్రక్కు వాళ్లను ప్రతిమాలి నా ప్రయాణం సాగించవలసి వచ్చింది. ఆ వూరునించి ఉన్న రెండు పెద్ద రోడ్లు కూడా మర్చిప్యంగా తయారయ్యాయి. ఇక మిగిలింది మూడో మార్గం కొండ మార్గం. సరే! దాన్నే పట్టుకొన్నాం. ప్రాణాంతకమైన ప్రయాణం అది! మా లారీ చీకట్లో ఒక చెట్టును ఢీ కొంది. నేను మాత్రం వెల్లకిలా వెనక్కి పడి డ్రైవర్ కోటు కొక్కానికి నా తల కొట్టుకొంది. నాకు పెద దెబ్బ తగల్లేదు కాని, లారీ తలుపుకు పాపం డ్రైవర్ చెయ్యి మోసింది— బాగా దెబ్బ తగిలింది.

అయితే ఈ ప్రమాదం చాలా అదృష్టకరమైనదనే చెప్పాలి. ఈ చెట్టును కనుక మేము ఢీకొని ఉండకపోతే, నేరుగా మేము మా లారీతో సహా ఒక నూరడుగుల లోతు లోయలోకి పిలుపు లేకుండా దిగబడి పోయేవాళ్లం. కొండ అంచున మా లారీ వ్రేళ్లాడుతుంది. ఇంకొక మూడు మైళ్ల దూరంలో తప్ప మనుష్య సంచారమే ఉన్నట్టు లేదు. కాని లారీ డ్రైవర్ కదిలే స్థితిలో లేడు. నేను ఆ చీకట్లో ఒంటరిగా గ్రామానికి బయలుదేరాను. ఎవరినైనా సాయం పిలుచుక వద్దామని నా ఉద్దేశం. చంద్రుడు అప్పుడే ఉదయిస్తున్నాడు. ఎక్కడా చీమ చిట్టుక్కు మనటం లేదు. అంతా నిశ్శబ్దం. వెన్నెల "మంచు రాళ్ల" మీద ప్రతిఫలిస్తోంది. నాకు నడక హాయిగానేఉంది. కాని, అంతలో గబుక్కున ఈ తోడేళ్ల మూక నా మీద పడ్డది. సరే మొదటే చెప్పాను గదా! నేను వాటి పని ఎలా పట్టించానో! నా తుపాకిలో గుళ్లన్నీ ఖాళీ చేసికొని నేను పరుగెత్తటం మొదలెట్టాను. చచ్చి పడ్డ రెండు తోడేళ్లను చూస్తే, నా గుండె జల్లుమంది. తుపాకిలో గుళ్లు కూడా లేవేమో మరీ భయంగా ఉంది. నా మోకాలు చిప్పలు వూడిపోతూన్నంతగా కాళ్లు పీకుతున్నయ్. నిజానికి మరో సంగతి నేను గ్రహించినప్పుడు గుండె ఇంకా జల్లుమంది. నేను తుపాకీ తోడేలు మీదికి పేల్చినప్పుడు నా బుజం మీదుగా పేల్చాను. కాస్తలో తప్పింది గాని, గుండు నాబుజంలోకుండా దూసుకు పోయేది. కాని, అక్కడ ఆలోచించుకొనేందుకే 'టైం' లేదు. పారిపోయిన తోడేలు మరి కొన్నిటిని సాయం తీసుక వస్తుందేమో నని భయం. నా జీవితంలో ఎన్నడూ ఎరగనంత గాభరాగా భయంగా ఎక్కడ ఏ చిన్న శబ్దం విన్నా, ఉలిక్కిపడుతూ, బెదరుతూ, తొట్రుపడుతూ ఆ నిశ్శబ్ద వాతావరణంలో అడివి గుండా గ్రామానికి చేరుకొనే సరికి, కుప్పలా కూలిపోయాను. డ్రైవర్‌కి సాయం పంప గలిగాను కాని, నా తలకు తగిలిన గాయాన్ని కడిగి, పడుకో బెట్టవలసి వచ్చింది.

మరి రెండు రోజుల తర్వాత, నేనూ, నా కీలుగుర్రం 'రోజ్ నాన్‌టే' బల్గేరియా సరిహద్దులు చేరుకున్నాము. అమ్మయ్య! ఇంకొంచెంలో మేమ్మి ఇనుపతెరను దాటి బయట పడ నున్నాము.

ఇండియాకు సాగిన ఈ ఆరువేల మైళ్ల సుదీర్ఘ యాత్రలో అతి భయంకరమైన సంఘటన మరొకటి నేను బస్సుమీద టర్కీ మధ్యప్రదేశంలో ప్రయాణం చేయవల్సి వచ్చినప్పుడు జరిగింది. మంచుమీద సైకిల్ తొక్కడం అసంభవమైంది. బస్సు టాపుమీద రోజినాన్‌టే నెక్కించవల్సి వచ్చింది. బస్సు ప్రయాణం చేస్తో ఉంటే మంచు గుట్టలు గుట్టలుగా— ఒక్కొక్కప్పుడు ఏభై అడుగుల ఎత్తు మంచు కుప్పలు కూడా అటూ ఇటూ ముందూ వెనుకా అగుపించాయి. మేం ప్రయాణం చేస్తున్నాం. అంటే ఎర్రని చిన్న పాసింజర్ బస్సులో నాతోపాటు మరో 40 మంది టర్కీ ప్రయాణీకులున్నారు. అయితే వాళ్లంతా మగరైతులే. స్త్రీలు— పిల్లలూ లేరు. కాని వాళ్లకన్నా మొండివాన్ని నేను ఉన్నానుగా. (చెప్పానుగా బాబోయ్? ఇలాంటి దారుణమైన చలికాలం మున్నెన్నడూ ఎరుగను) మా ఊరి వాళ్ల అంచనాయే నిజమవుతుందా? నాకు మంచులోనే సజీవ సమాధి ప్రాప్తిస్తుందా? అనే భయం కూడా కలిగింది.

ప్రాన్సు, ఇటలీ, యుగోస్లావియా, బల్గేరియా, ఇవన్నీ దాటి ఆరువారాల అనంతరం— నేను టర్కీలో అడుగు పెట్టినా కూడా మంచు కురవడం మానలేదు. మార్చి రెండోపక్షం వచ్చినా చలిపీడ విరగడ అవలేదు.

## మంచు గండం

ఒక చోటుకి వచ్చాము. ఒక కొండ కనుమగుండా వెళ్తోంది బస్సు. అంతే మరి కదల్లేదు. మంచు గడ్డల్లో కూరుకు పోయింది. నా ఆశ అంతరించి పోయింది. "అయిపోయింది. లిస్మోర్ మా వాళ్లందరూ అనుకున్నంతా అయిపోయింది. మన యాత్రకి యిక ఫుల్‌స్టాప్? మన జీవితం నేటితో సరి" అనిపించింది. పారలు, గునపాలు లాభంలేదు, మంచును దున్ని మార్గం చేసే నాగలి కావాలి. సాయపడటానికి మనుషులే కాదు యంత్రాలు

*మంచులో; చలిలో, ఎండలో, వానలో, కారడవులగుండా, దుండగుల చేతులలో నించి, రైతుల ఔదార్యంమీదుగా; సైకిల్ మీద ఒకసారి, తనమీద సైకిల్‌తో మరోసారి, డెర్వ్లా తన "ఢిల్లీ చలో" సాహసయాత్ర సాగిస్తున్నది. అందులో యిది రెండో భాగం.*

కావాలి— కాని మంచు ఇంకా ఇంకా పేరుకుపోతోంది. బసు గడ్డలు గడ్డలు నిండిపోతోంది. అంతకు వారం క్రితమే ఇలాగే ఒక బస్సు మొత్తం అరవై ప్రాణాలతో మంచులో కప్పడి పోయిందిట. అజాపజా లేదుట. నా గుండెల్లో మంచులా దిగులు పేరుకుంది ?

నాలుగు గంటలు నాలుగు యుగాల్లాగ గడిచాయి. సాయం తెద్దామని వెళ్లిన మనిషి వచ్చాడు. కాని అతను తెచ్చిన వార్త వింటూనే మిగిలిన ఆశ కూడా ఆరిపోయింది— మంచు దొలిచే యంత్రం దానిలోని పని వాళ్లిద్దరితో సహా— కొండ అంచును ఢీకుని ముక్క ముక్కలై పోయింది. వాళ్లిద్దరూ ప్రాణాలు కోల్పోయారు. మరెవ్వరూ మాకు సాయ పడటానికి సాహసం చెయ్యడం లేదు—

ఎట్టకేలకు మరో ఆరు గంటలకు కాని మాకు సాయంచేయగల మంచు నాగరి రాలేదు. చీకటిపడ్డది. మరో ఆరు గంటలు అవస్థలు పడితేగాని మాకు మార్గం కాలేదు. చివరికి 'ఎర్‌జురుమ్' నగరానికి చేరుకున్నాను. "చావు తప్పి కన్ను లొట్టపోయిందన్నట్లయింది."

మేం అక్కడకు చేరే సరికి తెల్లవారు ఝామున 4 గంట లయింది. 40 మంది రైతులు, స్వెట్టర్, స్లాక్ వేసుకున్న ఒక వింత వనితను అక్కడివారు బాగానే ఆదరించారు. యుగోస్లావియా, బల్గేరియాలోను ఎలా అయితే రాత్రుళ్లు గడిపానో అలాగే ఇక్కడ కుటుంబీకుల ఇళ్లల్లో రాత్రుళ్లు గడిపాను.

## సైగలతో స్నేహం

కాని టర్కీలో కొత్త సంగతి వాళ్ల భాష నాకు, నాగోల వాళ్లకి అస్సలు అంతుపట్టలేదు. మూగ వాళ్లల్లా సైగలు చేసుకున్నాము. ఇంకా బాగా ఆశియా లోని లోపలి నగరాలకు నేను వెళ్లినప్పుడు అక్కడి ప్రజలు నన్ను మరీ వింతగా చూశారు.

సైకిల్ మీద వచ్చి గుమ్మంలో నిలబడి "నేను ఐర్లేండ్ దేశస్థురాలిని" అంటున్న ఆడపిల్లను వాళ్ళు మనిషా ? దెయ్యమా ? అని సందేహించ లేదు కాని ఐర్లెండ్ అంటే దేశమో ? నగరమో అసలు రాయో రప్పో ఏమీ తెలియదన్నారు. కాని ఆ సంసారులందరూ నన్ను ఔదార్యంతో ఆప్యాయంగా చూశారు— నాకు కలిగిన ఇబ్బందంతా రోడ్ల మీద తారసపడే దుండగీండ్రతోటే.

మధ్య పర్షియాలో పడ్డాక "అమ్మయ్య మంచు పీడ నుంచి బయట పడ్డాను." అనుకున్నాను. కాని భగవాన్ ? ఇక్కడే అసలు ముప్పు వచ్చింది.

కొండ మార్గం అది సైకిల్ దిగాను. పసుపు పచ్చని రంగు నల్లని చారలు ఉంటాయి నా సైకిల్‌కి అక్కడే 'రోజెనంటే'ని విశ్రాంతి తీసుకోమని పెట్టి— ఒక కొండ బండరాయి మీద కూచుని 'ఫలహారం' చేస్తున్నాను. ముగ్గురు మనుషులు మంచి బలిష్ఠకాయులు దూరంనించి వస్తూ అగుపించారు. వాళ్ళ భుజాల మీద గడ్డపారలున్నాయి.



అక్కడ ఇలాంటి వాళ్ళు కనబడ్డం మామూలే. నేనంతగా పట్టించుకోలేదు. కాని, ఉన్నట్టుండి అందులో ఒకడు నా సైకిల్ పట్టుకుని పరుగు లంకించుకున్నాడు. ఉలిక్కిపడి లేచాను కాని తతిమ్మా ఇద్దర్లో ఒకడు సైకిల్ వెంట; ఇంకొకడు గడ్డపారతో బెదిరిస్తూ నామీదకూ వచ్చి— పడ్డారు. నేను ధైర్యం చిక్క పట్టుకున్నాను. పాపం ఆ ముష్కరునికి నా దగ్గర రివాల్వర్ ఉన్న సంగతి తెలీదనుకుంటాను. మెరుపులా నా తుపాకీని తీసి ఢాం అని వాడి తలమీదగా పేల్చాను. దెబ్బకి గడ్డపార అక్కడ పారేసి కాళ్లకి బుద్ధి చెప్పాడు. దీంతోనే ధైర్యాన్ని మరింత పుంజుకొని నా కీలుగుర్రాన్ని పట్టుకుని పారిపోతున్న తతిమ్మా ఇద్దరి తలలమీద గుండా మరి రెండుసార్లు గాలిలో పేల్చేసరికి దాన్నక్కడ పడేసి ముగ్గురు ముక్కుకు సూటిగా వెనుదిరిగి చూడకుండా పారిపోయారు. పాపం వెర్రివాళ్లు—ఇది నరకెప్పుడూ ఒక ఆడపిల్ల తుపాకీ నేరుగా తమ మీదకు పేలుస్తుందని అనుకుని ఉండరు. అక్కడికా గండం గడిచి బయట పడ్డాను గాని ఇంకా పెర్షియాలో నా పాట్లు పూర్తి కాలేదు.

## రివ్వు రివ్వున రాళ్ల వాన

మాషెద్ నగరంలో తాపీగా దిక్కులు, దుకాణాలూ చూసుకొంటూ సైకిల్ తొక్కుకుంటూ వెళ్తూ ఉంటే ఉన్నట్లుండి నా మీద రాళ్లవర్షం కురిసింది. ముస్లిమ్ కుర్రాళ్లు కొంత మంది వాళ్ల మత గురువు ఆజ్ఞ శిరసావహించి నేను ముసుగు (బురఖా) ధరించలేదని నా మీద ఇలా యుద్ధం ప్రకటించారట. ఈ అనాగరిక ప్రాంతంలో ఆడది ఘోషా చూపించక పోవడం మత ద్రోహంగా భావిస్తారట. నేను వెంటనే ముసుగు ధరించలేదు గాని నా కీలుగుర్రాన్నదలించి వెంటనే వాయువేగ మనోవేగాలతో పారిపోయాను. అప్పటికి దెబ్బలు లేకుండా బయట పడ్డాను ఆ తర్వాత తెలుసుకున్నాను. ఇలాంటి పాపమే చేసిన ఒకస్త్రీని వారం రోజుల క్రితం ఈ ప్రాంత వాసులు రాళ్లతో కొట్టి చంపారట.

ఆఫ్‌గన్ స్థాన్‌లో మాత్రం దెబ్బలు తప్పించుకోలేక పోయాను. తుపాకీ మడమ దెబ్బలకి కనీసం నా మూడు ఎముకలైనా విరిగి పోయాయి. అయితే ఈసారి ముసుగు వేసు కొనలేదనే పాపపరిహారార్థం కాక ఉత్త పుణ్యానికే దెబ్బలు తిన్నాను. ఒక ఆఫ్‌గన్ సోల్జరు, ఒక బస్సు డ్రైవరు వాదులాడుకుంటున్నారు— ఆ మధ్యగా నేను వెళ్తున్నాను. సైనికుడికి కోపం వచ్చింది. డ్రైవర్ మీదకి తుపాకి మడమను తిరగేశాడు. అది ఖర్మవశాత్తు నా వీపు మీద పడ్డది. ఎముకలు నున్నం అయ్యాయి!

సరే పాకిస్తాన్ ఆఫ్‌గనిస్తాన్‌లలో వీటన్నిటినీ మించి ప్రాణాలను కడబట్టించినది మరో శత్రువు ఉంది. అదే విపరీతమైన వేడిమి. గిల్‌గిత్ నుంచి చిలాస్ కి లోయ మార్గం గుండా చేరుకునేటప్పటికి చచ్చినంత పనైంది. 96 మైళ్ల దూరాన్ని మూడ్రోజులు ముప్పతిప్పలు పడితేగాని దాటలేక పోయాను.

నేను తీసికొన్న కొండమార్గం చాలా ఇరుకైనది. అటూ, ఇటూ, నూరు, నూటమున్నెభై అడుగుల ఎత్తున ఉన్న కొండల గుట్టల గుండా సన్నగా, పల్లంగా ఉండే ఈ మార్గంలో బళ్ళరాకపోకల రద్దీ ఉండదు. వారానికొక్కసారి ఏదైనా ఒక్క జీపు ఈ మార్గం గుండా వెళుతూ ఉంటుంది. ఈమార్గంగుండా పైకి నేను వెళుతున్న జీపును చూశాను. కొంత దూరం వెళ్లాక, ఈ ఇరుకైన మార్గంగుండా జీపు వెళ్లలేక పోయింది. దానిలో ఉన్న ఇద్దరు మనుషులూ దిగి నడవ వలసి వచ్చింది. ఒక చేత్తో కొండ అంచునీ, రెండో చేత్తో సైకిల్ 'హేండిల్‌బార్'నీ పట్టుకుని కిందకు జారి పోయే ప్రమాద భరితమయిన మార్గం గుండా వెళ్ల నుంకించుచున్న నన్ను విస్తుపోయి చూశారు వాళ్ళు. అటు తర్వాత, మరి మూడు రోజులు నాకు నరసంచారమే తగల్లేదు. కాని, ఈ మూడు రోజుల ప్రయాణంలో నేను కలిసికొన్న మరొక ప్రాణి బహు విచిత్ర మయినవాడు, చాలా భయంకరంగా ఉన్నాడు. వాడు ఉన్నట్టుండి ఒక కొండ గుట్ట వెనుక నుంచి నా ముందుకు లంఘించి నిలబడ్డాడు. పూర్తిగా నగ్నంగా ఉన్నాడు. వాడిజుట్టు, గడ్డాలు, ఎట్టి సంస్కారమూ లేకుండా మోకాళ్లవరకూ జడలు జడలుగా వేళ్లాడుతున్నాయి. వాడిచర్మమంతా ఎండవేడికి పెట్లి పోయి ఉంది. వాడు రెండు చేతులూ బారచాచి అరుస్తూ నన్ను కౌగలించుకోవాలని మీద మీదకు వచ్చేస్తున్నాడు. మోకాటి లోతు ఇసుకలో కూరుకుపోయి ఉన్న నా కీలుగుర్రం నన్ను మోసే అవకాశం లేదు. దాన్నే నేను మోసుకొని, ఈ ఢిష్టిబొమ్మలాంటి పిచ్చివాడు వెంటాడుతూ

# సైకిల్ మీద అబల సాహస యాత్ర !

ఉండగా, మండుటెండలో పరుగెత్తాను. వాడైతే, పట్టుదల వదలి వెనుదిరిగి పోయాడు కాని, సూర్యుడు మరింత తీక్షణంగా వెంటబడ్డాడు. ఇసుక, గుట్టలు —కొండవాగులు, ఎక్కడా లేవు. గొంతుక ఆరి పోయింది. ఎట్టకేలకు చిన్న కొండవాగు కనుపించింది. లేచి వచ్చిన ప్రాణాలతో, ఒక్కసారి ఎలా ఉన్న దాన్ని అలాగే నీళ్లలో పడ్డాను. ఇవతల పడ్డ రెండు నిమిషాలకే మళ్లా నా బట్టలు అప్పుడాల్లా ఆరిపోయాయి — అంతగాఎండగా ఉన్నదన్న మాట !

నా నీళ్లకూజా నిండా నీళ్లు నింపుకొన్నాను. కాని ఆరు 'పింట్ల'కన్నా నీరు ఎక్కువ మోసుకు పోగల అవకాశం నాకు లేదు. మూడవ రోజున దాహంతోనేను పడ్డపాట్లు, పరమాత్ముడికే ఎరుక మిట్ట మధ్యాహ్నం ఎండలో ఒయాసిస్సుకు వెతికే బిడారిలలా ఉన్నాను నేను. మధ్యాహ్నం మూడు గంటల వేళకి వడగాడ్పు తగిలింది. నేను బాగా నీరసించి పోయాను. గొంతుకతడి ఆరిపోయింది. కళ్లూ, కాళ్లూ తేలిపోతున్నాయ్. కుప్పలా కూలి పోయాను. నరాలు తెగుతున్నాయి. నేను చేరవలసిన చిలాస్ ఇంకా ఎంతో దూరం ఉండి ఉండదు. కాని, నాకు మాత్రం నీరసం, నిద్ర ముంచుకొస్తున్నాయి. రోడ్డు చాలా పల్లంగా ఉంది.'రోజ్‌నాంటే'హాండిల్ బార్ నా చేతిలో సరిగా ఉండటంలేదు. సైకిల్ వంకర, టింకరగా జారి పోతున్నది. కంట్రోల్ చేసు కోవటం చాలా కష్టంగా ఉంది. అదంతా గడిచి బయట పడి, చిలాస్ చేరుకొనేసరికి నన్ను ఆవరించిన 'పీడకల' ఇంకా వదిలినట్లు లేదు. ఎండిపోయిన, బడిలి పోయిన నా శరీరం, నా మనస్సు మళ్లీ కుదుట పడేసరికి రెండు రోజులు పట్టింది. అప్పుడు కాని, స్థానిక గ్రామీణ జీవితాన్ని, వేల సంవత్సరాలుగా మార్పు, కూర్పులేని వారి సంస్కార సంస్కృతులను చూడగల ఓపిక నాకు రాలేదు. వాళ్లంతా అప్పటికి తిండిలేక మలమల మాడుతున్నారు. పది హేనువేల అడుగుల ఎత్తున ఉన్న 'బాబుసార్' కనుమ మార్గం గుండా ఒంటెల మీద అక్కడి ప్రజలకు రావలసిన ఆహార పదార్థాలు చేరలేదు. కారణం : కనుమ మార్గమంతా మంచు మయ మయిపోయి ఉందిట.

కొన్ని రోజులపాటు' వాళ్లతోపాటు పరిమితాహారం తీసుకొంటూ గడపవలసి వచ్చింది. జూన్ 19 తారీఖున తిరిగి నా ప్రయాణం సాగించటానికి నేను పూనుకొన్నాను. నాకు సాయం కూడా తటస్థ పడింది. ఆరుగురు గ్రామవాసులు, ఏడు పొట్టి గుర్రాలు గల ఒక బృందం 14 వేల అడుగుల ఎత్తున గల కనుమ మార్గాన్ని చేరుకొని ఆహార ధాన్యాలను తేవలసిన బిడారు ఏ పరిస్థితిలో ఉందో చూడాలని బయలుదేరారు. ఆ మార్గం చాలా ఎత్తుగా, జారుగా ఉంది. అయినా, రెండు గంటల్లో నేను అదివరకు ఎన్నడూ వూహించలేనంత దూరం నా సైకిలును ఈడ్చుకొంటూ ఎక్క గలిగాను. కాని, ప్రతి అయిదు నిమిషాలకీ ఒక్కసారి నేను వూపిరి కి ఉక్కిరి, బిక్కిరి అవుతూ ఆగి, విశ్రాంతి తీసికోవలసి వచ్చేది. ఎందుకంటే వాతావరణం చాలా పలుచగా ఉంటుంది కదా ! ఉండి ఉండి నా గుండెల్లో పిడుగులు పడ్డట్టు అయేది. అన్నింటి కన్నా, నా సైకిలును ఈడ్చుకొంటూ పోవడం మరీ బాధగా ఉంది. మళ్లీ మంచులో ప్రవేశించాను. కనీసం దాహమైనా తీరుతుందికదా అనిపించింది నాకు. కాని, నడవడం ఇప్పుడు ఇంకా దుర్భరమై పోయింది. ఒక్కొక్కసారి మోకాలి లోతున మంచులో కూరుక పోయేదాన్ని. మళ్లీ పొగమంచు, గడ్డమంచు, పాత బాధలు ప్రారంభం అయ్యాయి. ఎట్టకేలకు ఆ ఎత్తంతా ఎగబాకి చూసేసరికి నా ముందుగా వెళ్తున్న ఏడు పొట్టి గుర్రాల బృందం అగపడకుండా పోయింది. మంచు ప్రవాహం పెద్ద పెద్ద మంచు గడ్డలు, కదులుతూ జారుతూ ఎటుచూసినా అగుపిస్తున్నాయి. ఒక కొండమీంచి, మరొక కొండ కొనమీదకు, మంచు వంతెనలు తప్ప నేను దాటవలసిన వంతెన, మంచు ప్రవాహంలో ఎప్పుడో కొట్టుక పోయిందని గ్రహించాను. మళ్లీ దిక్కూ, మొక్కూలేని ఒంటరి దాన్ని అయాను. ఎటుచూసినా భయం! మంచు, చలి, ఏం చేయాలి భగవాన్ ! అంతలో ఒక ఆశ్చర్య కరమైన సంఘటన జరిగింది. దేవుడే పంపాడా? అన్నట్లు ఒక ఆవు ఎటో దారి వెతుక్కుంటూ వెళ్తున్నట్లు అనిపించింది. 'సరే ! కొట్టుకపోయే దానికి గడ్డి పోచయినా దొరికింది గదా !' ఆ ఆవువెంట పడ్డాను. ఏ మాత్రం కాలుజారినా, కింద ఎక్కడో మంచులోయలోకి జారిపోయి, సజీవ సమాధి అయిపోవటం తప్పదు. కాని ఆ ఆవు మెడ ఒక చేత్తో గట్టిగా పట్టుకొని, రెండోచేత్తో సైకిలు పట్టుకొన్నాను.

అయితే, ఆవు ధర్మమా అని నా ప్రాణాలు పోలేదు. అయితే, అప్పుడే ఏమయింది ? అటు తరువాత వచ్చింది ముసుళ్ల పండుగ ! నేను దాట వలసిన పదకొండు మైళ్లలో ఏడు హిమానీ నదాలు దాటవలసి వచ్చింది. మళ్ల మరో లోయ వచ్చింది. ఈసారి నల్లావు మార్గదర్శిగా నాకు తటస్థ పడ లేదు. ఒక ముప్పై అడుగులలోతుగా ఉన్న కొండ చరియ మీద నేనూ నా సైకిలూ ఇరుక్కుని ఉన్నాం. నేను బాగా అలిసి పోయాను. ఆకలి విప రీతంగా వేస్తోంది. అయితే, సూర్యుడు కూడా నన్ను ఒంటరిదాన్ని చేసి, ఇంకా దూరం దూరంగా వెళ్లి పోతున్నాడు. వెలుతురు మరో మూడు గంటలు ఉంటుందేమో ! ఈలోగానే నేను ఎలా గైనాసరే బలికి బయట పడాలి. కొండ కొన ఎక్కి అవతలి వైపు దిగాలి. తప్పదు. కాని సైకి లును ఈడ్చుకొంటూ వెళ్లటం మరీ కష్టంగా ఉంది. ఇక లాభం లేదని సైకిలును కావిడిలా నా భుజం మీద వేసికొని ప్రయాణం సాగించాను. ఒక్కసారి సైకిలు రిమ్ములు, చక్రాలు కాలుజారి పడ్డప్పుడల్లా నాకు తగిలి విపరీతమైన నొప్పి వేసేది.

ఆర్చేవారూ, తీర్చేవారూ లేకపోయినా 'అయ్యో! అమ్మో' అనిగట్టిగా ఏడ్చేసేదాన్ని. నిజంగా అప్పుడనిపించింది. లిఫ్మోర్ నేస్తాలు చెప్పిన మాట నిజమేనని. నేను నిజంగా వెర్రివాజన్మని. ప్రస్తుతానికి 'రోజ్‌నాంటే' మీద నా యాత్ర గాక, నా మీద 'రోజ్‌నాంటే' సవారీ చేస్తున్నది. హే భగవాన్ ! నేను ఇందులో నుంచి బయట పడగలనా !

(సశేషం)

# వంటలు

## పులిహోర గోంగూర పచ్చడి

| | |
|---|---|
| పచ్చడి గోంగూర (మంచిరకం) | వీశ. |
| ఎండు మిరపకాయలు | సవాశేరు. |
| ఉప్పు | మూడుగిద్దలు |
| చింతపండు | సవాసేరు |
| మంచినూనె | సవాసేరు |

గోంగూర కొన్న తర్వాత దాన్ని ఒక గుడ్డపై నీడ పట్టున ఆరవేసి, తర్వాత పుల్ల మొదలగునవి ఏరుకొని, బాణలిలో వేయించాలి. వేయించిన పుల్ల కూర చల్లార్చిన తర్వాత, దంచిన ఉప్పుతో బాగుగా కలియబెట్టి ఒక జాడీ కెత్త వలయును. మూడు రోజుల తర్వాత ఎండు మిరపకాయలను కొద్ది నూనెతో బాగుగా వేయించుకొని, కారంగా కొట్టు కొవాలి అంటే మెత్తగా పొడి కొట్టుకోవాలి. మెంతులు (ఒక గిద్దడు) వేయించి,(అంటే నూనెతో కాదు సుమండీ !) పొడి విసురుకున్న తర్వాత, ఓ స్టీలు గిన్నెలో ఆ పొడిని భద్ర పరచాలి. చింతపండు (సవాసేరు)ను నానబెట్టి, గుజ్జుగా పిసికి, ఆ గుజ్జును 'స్టౌ'పై తుకతుక ఉడకనిచ్చి మరొక స్టీలు గిన్నెలో పోసి చల్లార్చవలెను. జాడీ కెత్తిన ఉప్పు పచ్చడిని రోట్లో వేసి మెత్తగా దంచాలి. తరువాత వేయించి, కారంగా కొట్టిన మిరపపొడిని, ఉడక బెట్టిన చింతపండు గుజ్జును, మెంతి పొడిని, దంచిన ఉప్పు పచ్చడిలో వేసి, దాన్ని జాడీలో వేసి, బాగా గుచ్చెత్త వలెను. టీస్పూన్‌తో దానెడు పసుపు పొడిని కూడా వేసి గుచ్చెత్తితే ఇంకా బావుం టుంది. సవాసేరు మంచి నూనెను బాగుగా కాగ బెట్టి, దాంట్లోనే ఎండు మిరపకాయల ముక్కలు, రెండు టీస్పూన్ల మెంతులు, ఆవాలు వేసి, ఇం గువ ముక్క నలుకును మెత్తగా పొడికొట్టి, ఆవే పాకుతో ఈ పొడిని వేసి మూత పెట్టవలెను. కొద్ది సేపటి తర్వాత ఆ నూనెను చల్లార్చవలెను. ఆ తర్వాత ఈ నూనెను జాడీలో నున్న పచ్చట్లో పోసి క్రింది నుండి పైకి, పై నుండి క్రిందికి బాగుగా కలియ బెట్టవలెను. తర్వాత మూత బెట్టి రెండు మూడు రోజుల తర్వాత వాడుకుంటే. . . . దాని రుచి. . .

## మిరప్పళ్ల గోంగూర పచ్చడి

వీశ గోంగూర కొని, ఆరబెట్టిన తర్వాత, మూకుడులో, బాగా వేయించి, ఒక పావడబ్బా ఉప్పును మెత్తగా దంపి, గోంగూరతో ఉప్పును కలిపి, ఓ జాడీకి ఎత్తి పెట్టుకోవాలి. మూడు రోజుల తర్వాత, వీశ గోంగూరకు అరవీశడు మిర ప్పళ్లు, డబ్బా ఉప్పుపోసి, బాగా దంచాలి. గిద్దెడు మెంతుల్ని వేయించి, పిండి విసురుకోవాలి. దంచిన మెరప్పళ్లను, రోట్లో వేసి మెత్తగా రుబ్బుకోవాలి!!! జాడీకి ఎత్తి పెట్టుకున్న గోంగూరను పైపైన తేలిగ్గా దంచాలి. రుబ్బి పెట్టిన మెరప్పళ్ళ, ఖారం, కొద్దిగా పల్లయింగువ పొడి, మెంతిపిండి, వీట న్నింటినీ కలియబెట్టి, ఆ గోంగూరలో బాగా కలిపి గుచ్చెత్తాలి. ఈ మెరప్పళ్ల గోంగూర పచ్చడి సంవత్సరాంతము వరకు, వాడుకోవచ్చును. వాడుకున్నప్పుడల్లా, పోపు పెట్టుకొని, వాడు కుంటే దాని రుచి. . . దివ్యంగా ఉంటుంది.

శ్రీమతి కోపల్లె రుక్మిణీ రమణ ★

# అమెరికాలో విదుషీమణులు!



ఎలినార్ రూజ్వెల్టు



పెరల్ ఎస్. బర్క్



మారియన్ ఆండర్సన్

[గత సంచిక తరువాయి]

## స్వచ్ఛందసంస్థలు:

అమెరికాలో ఎందరో మహిళలు కర్మాగారాల్లో కార్యాలయాల్లో పనిచేస్తున్నారు. కాని వారి సంఖ్యకు తగ్గట్టుగా "ప్రతిపత్తి" మాత్రం ఇంకా లభించలేదు. అనేక స్వచ్ఛంద మహిళా సంస్థలద్వారా 'స్త్రీలుకూడా వున్నారు. వాళ్లదొక బలీయమైన శక్తి' అనే విషయం ఋజువుచేసుకుంటున్నారు.

గృహిణులు గృహ నిర్మాణంలో అనేక నవనాగరిక మార్గాలు, మెళువులు కనిపెట్టారు కాబట్టి, ఎక్కువ కాలాన్ని నర్సరీ స్కూళ్ళ, వికలాంగుల స్కూళ్ళ నడపటానికి వినియోగిస్తున్నారు. ఈ సంస్థలద్వారా, గుండెజబ్బులు, కాన్సర్ మొదలైన వ్యాధులను గురించి పరిశోధనచేయడానికి వలసిన డబ్బును పోగుచేస్తున్నారు. ఇలాంటి స్త్రీ సంస్థల కృషి వల్లనే అనేక అభివృద్ధికరమైన "లా"లు ప్యాసయినవి కూడా!

నూరుకుపైగా మహిళా సంస్థలు దేశమంతటా పనిచేస్తున్నవి. వాటి శాఖలు ఎన్నో వున్నవి. వాటి సభ్యత్వం దాదాపు 30 మిలియన్లు. వాటిలో ప్రొటెస్టెంటులు, కాథలిక్కులు, జ్యూయిష్ చర్చి గ్రూపులు ఉన్నవి. వ్యాపార సంస్థల్లోనూ, ప్రొఫెషనల్ సర్వీసుల్లోనూ ఉన్న స్త్రీలకు ప్రత్యేకంగా, క్లబ్బులున్నవి. లాయర్లకు, సోషల్ వర్కర్లకూ, సెక్రటరీలకూ, నర్సులకూ, ఆర్థిక శాస్త్రవేత్తలకీ వేర్వేరు సంఘాలున్నవి. గరల్‌స్కౌట్సు, వై.డబ్ల్యు.సి.ఎ. మొదలైన సంస్థలున్నవి. రెడ్‌క్రాస్, అమెరికన్ ఉమెన్ వలంటరీ సర్వీసెస్ మొదలైనవి ప్రత్యేకమైనవి. వీటిద్వారానే ఎక్కువమంది సంఘసేవికలు, వలంటీర్లు రిక్రూట్ చేయబడతారు.

అస్పత్రులలోనూ, క్లినిక్స్ లోనూ, ఆట స్థలాలలోనూ, స్కూలు లైబ్రరీల్లోనూ, లంచ్ రూముల్లోనూ వలంటీర్లు చేసే సేవ లెక్కకట్టా లంటే ఎన్నో మిలియన డాలర విలువ వుంటుంది. ఈ వలంటీర్లు అస్పత్రులలో ఉండే రోగులకు సర్వ విధాలా సేవ జేస్తారు. వారికి వచ్చిన ఉత్తరాలను చదివి, రాయవలసిన ఉత్తరాలను రాసిపెట్టి రోగులకు మనోల్లాసం కలిగేలాగా చూస్తారు. ఈ 'పనంతా' చేయటానికి అస్పత్రులో పనిచేసే నర్సులకు తీరిక వుండదు. కాబట్టి ఈ వలంటీర్లను రోగులు ఎంతగానో అభినందిస్తారు.

రాష్ట్రప్రభుత్వాలు, స్థానిక ప్రభుత్వాలు ప్రజావసరాలు గుర్తించి ఎన్నో సౌకర్యాలు కలుగజేస్తున్నాయి. కాని ప్రభుత్వం చూడలేని అవసరాలు కొన్ని ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. ఈ అవసరాలనే అమెరికాలోని మహిళాసంస్థలు తీర్చడానికి ప్రయత్నిస్తున్నాయి.

వీటన్నిటిలో "జనరల్ ఫెడరేషన్ ఆఫ్ విమెన్స్ క్లబ్స్" అనే సంస్థ పెద్దది. పట్టణాలలో, చిన్నచిన్న నగరాలలో యీ సంస్థకు 15,000 క్లబ్బులు ఉన్నాయి. 53 ఇతర దేశాల్లో 160 అఫిలియేటెడ్ బ్రాంచీలు ఉన్నవి. ఏదైనా ఒక హాస్పిటలు స్థాపించాలన్నా, స్కూలు కట్టించాలన్నా, రిక్రియేషను సెంటరు ప్రారంభించాలన్నా తదితర ఏ అభివృద్ధి కార్యక్రమానికయినాసరే ఈ సంస్థ ముందంజవేసి సర్వవిధాలా సహకరిస్తుంది.

చిన్న చిన్న క్లబ్బులు స్థానికంగా ఎన్నో ఉన్నవి. "ఆల్ ట్రూసా" అనే క్లబ్బు వృద్ధులైన స్త్రీలకు సహాయం చేస్తుంది. ఈ క్లబ్బులోని వారంతా వ్యాపారస్థులూ, వృత్తుల్లో ఉన్నవారూ! "అమెరికన్ అసోసియేషన్ ఆఫ్ యూనివర్సిటీ ఉమెన్" అనే సంస్థ సంవత్సరానికి వంద ఫెలోషిప్పులు యివ్వటానికి కావలసిన ధనసహాయం చేస్తుంది. అమెరికాలోని మహిళలు ఇతర దేశాలకు వెళ్లి రిసెర్చి చేయడానికి 50 ఫెలోషిప్పులు ఇవ్వబడతాయి. అలాగే యితర దేశాలకు చెందిన మహిళలు అమెరికాకు వచ్చి విద్యా విషయకంగా కృషి చేయదలచినట్లయితే మిగతా 50 ఫెలోషిప్పులు వారికి వినియోగించబడతాయి.

25,000 సభ్యులుగల "డెల్టా సిగ్మా తీటా" అనే నీగ్రోసంస్థ ఒకటున్నది. ఇందులో ఆఫ్రికాలో జాతులవారూ సభ్యులుగా ఉన్నారు. దీనికి 5 శాఖలున్నవి. ప్రత్యేకమైన గ్రంథాలయ సౌకర్యాలు కల్పించటం, ఉద్యోగాలు చూపే క్లినిక్‌లు నడపటం, వర్కుషాపులు నడపటం, మానసికంగా జనులు ఎలా ఆరోగ్యవంతులు కావటం అవసరమో చెప్పటం అంతర్జాతీయ రంగంలో సౌభ్రాతృత్వం పెంపొందింపజేయటం ఈ శాఖల ముఖ్య విధులు.

## రాజకీయ రంగంలో

సంఘసేవతో ప్రచారం ప్రారంభించిన మహిళలెందరో రాజకీయ దురంధరులుగా రాణిస్తున్నారు. 1920 వ సంవత్సరంలో వోటింగు హక్కు లభించిన తర్వాత ఎలెక్షన్ ప్రచారాలు, రాజకీయ దుమారాలు నడపటంలో కొత్త కొత్త విధానాలు కనిపెట్టారు. 40 సంవత్సరాల క్రితమే స్థాపించబడిన స్త్రీ వోటర్ల లీగ్ ఒకటి, ప్రతి మహిళా, ప్రభుత్వ విధానాలు రూపొందించటంలో ఎలా భాగస్వామియో నచ్చచెప్పి, మహిళ లందరూ విరివిగా ఎలెక్షన్లలో ఉత్సాహంగా పాల్గొనేటట్లు చేయగల్గుతున్నది. టెలిఫోన్లలో పిలిచి మాట్లాడి, ఇంటింటికీ తిరిగి, ఉత్తరాలతో 'కాంట్రాక్టు' చేసి, ప్రచారానికి తగిన సాహిత్యం అందరికీ అందజేసి, పోలింగునాడు ఉమెన్ వోటర్లను పోలింగు బూతులకు తీసుకపోయి స్త్రీలే వోటుచేయించటం నేర్చుకున్నారు. కాఫీ టేబిలు దగ్గర ఘనమైన రాజకీయ సిద్ధాంతాల చర్చ జరిగేటట్లు చూడగలిగేది మహిళలే! పార్లమెంటు దగ్గరనుంచీ పక్కింటివారి దాకా ప్రచారం చేస్తున్నదీ మహిళలే! అభ్యర్థిగా నిలబడిన వ్యక్తిని యుక్త ప్రశ్నలు వేసి గెలిస్తే ఏమిచేసేదీ నిగ్గతీసి అడుగగలిగేది మహిళలే! ఈ విషయంలో ఎప్పుడు ఏ సందర్భంలో ఎవరు ఎలాచేశారనేది చెప్పటం కష్టమే కాని మొత్తంమీద మహిళలు తమ అభ్యర్థి విజయానికి

మీరు డ్రిల్లు, లాంగ్‌క్లాత్
కొనేటప్పుడు...

# ట్విన్ టస్కర్

చిహ్నం కోసం చూడండి.

ఈ చిహ్నం
మీరు విశ్వసించదగిన నాణ్యతకు
ఇది గుర్తు





హార్వే

# ట్విన్ టస్కర్

డ్రిల్లు, లాంగ్‌క్లాత్

మధుర మిల్సు ఉత్పత్తి
నాణ్యమైన నూలుకు మారుపేరు.

మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై
మేనేజింగ్ ఏజెంట్లు: ఎ & యఫ్ హార్వే లిమిటెడ్



మధురకు చేరిన హార్వేస్

83.MMC.14A TEL

# వనితాలోకం వ్యాసం

కోసం కష్టపడి పనిచేసి విజయం సాధించ గలుగుతున్నారు. అసంఖ్యాకంగా మహిళలు మేయర్లు గానూ, సిటీ కౌన్సిలు సభ్యులుగానూ, ఎడ్యుకేషన్ బోర్డు సభ్యులుగానూ ఎన్నుకోబడు తున్నారు. ఒక్క 1961—1962 వ సంవత్సరము లోనే, 18 రాష్ట్ర సెనేట్‌లలో 34 మంది మహిళలు ఎన్నిక అయినారు. 43 రాష్ట్రాలలో 294 మంది దిగువసభలకు ఎన్నుకోబడ్డారు. 7 రాష్ట్రాల్లో రాష్ట్రప్రభుత్వ సెక్రటరీలుగా ఉద్యోగనిర్వహణం చేస్తున్నారు.

కాని, అంత పెద్ద దేశంలో చాలా కొద్దిమంది మాత్రమే సెనేటర్లు గా ఉన్నారు. 1960 లో జరిగిన ఎలెక్షన్లలో ఇద్దరే మహిళలు అమెరికాలోని కాంగ్రెసుకు ఎన్నిక అయినారు. 17 మంది మాత్రమే ప్రజాప్రతినిధుల సభకు (House of Representatives) కు ఎన్నికఅయినారు. దీనికి కారణం కేవలం వ్యక్తిగతమైనదే ! అవివాహితులైన స్త్రీలుగాని, వితంతువులుగాని ముందుకు రారు. రాజకీయమైన "కెరీర్" వారికి అందుబాటులో కూడ ఉండదు. ఎలక్షన్లలో తల దూర్చాలంటే తగినంత ఆర్థికస్తోమత ఉండాలి. ఏదైనా వ్యాపారసంస్థలో భాగంగాని, వృత్తిరీత్యా మంచి సంపాదనగాని లేకపోతే ఎలెక్షన్లలో నెగ్గటం కష్టం. కాంగ్రెసులో ఉన్నప్పుడు పురుషులలో హెచ్చుమంది ఇలాంటివారే ! అంచేత ఒంటరిగా ఉన్న స్త్రీలకు రాజకీయ జీవితం సాధ్యమయేది కాదు. పోనీ ఐశ్వర్యం, అభిరుచీ ఉన్న స్త్రీలున్నారా అంటే వారికి కుటుంబ పరిస్థితులు అనుకూలంగా ఉండవు. భర్తలనూ, బిడ్డలనూ విడిచి సంవత్సరంలో ఆరు మాసాలు వాషింగ్టన్‌లో ఉండాలంటే వారికి సాధ్యమయే పనికాదు.

సాధారణంగా అమెరికన్ మహిళకు "కుటుంబ జీవితంలో" శ్రద్ధ ఎక్కువ. నూటికి 90 మంది వివాహితులై స్థిరపడిపోవటానికే యిష్టపడు తున్నారు. వారాంతానికి ప్రతి మహిళా తన భర్తతో, బిడ్డతో "మార్కెటింగ్" కు వెళ్లటం, స్టోర్సులో సామానులు కొని తోపుడు బండీలో తీసుకరావటంలో ఉన్న ఆనందం ఆస్వాదించాలని కోరుకుంటున్న కుటుంబీకులు ప్రతీ ఆదివారం ఏదో ఒక ఆర్టు మ్యూజియం సందర్శించటానికో, సినిమాలకో, మిత్రుల యింటికి భోజనాలకో వెళ్లటం పరిపాటి. ఇక సంవత్సరాంతపు వేసవిసెలవలు సరేసరి !

మార్గరేట్ మీడ్ అనే సుప్రసిద్ధ మానవశాస్త్రవేత్త అమెరికన్ మహిళలలో కనబడుతున్న ఈ సంకుచిత దృక్పథాన్ని తీవ్రంగా విమర్శించింది. కాని ఇది సబబు కాదేమో అన్పిస్తుంది. దీనికి పూర్తి విరుద్ధంగా తమ సన్నిహితులకే కాక దూర దూరాలలో ఉన్న వారి ఎడల అమెరికన్ మహిళలు కూడా తమ ఆసక్తి చూపుతున్నారు. ప్రపంచం లోని కుటుంబాలన్నీ క్షేమంగా వర్ధిల్లాలంటే సుస్థిరమైన శాంతి స్థాపన అవసరమనేది గుర్తించారు కూడా !

—జె. వరలక్ష్మి ★




# ఎఫిసెన్సీ బార్

పోరంకి కనకలక్ష్మి

టైపిస్టు సరోజ కిలకిలా నవ్వింది !

హెడ్ గుమాస్తా— పరంధామయ్య నవ్వాడు !

నాలుగు రోజుల క్రితం లీవు వేకన్సీలో చేరిన వెంకటేశ్వర్లు నవ్వాడు !

ప్యూను యాదగిరి కూడా నవ్వాడు.

*    *    *

సూపరింటెండెంటు విజయరాఘవ్ ఆఫీసులో డిసిప్లైన్ పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటాడు. తెల్లవారి లేస్తే ఎన్నోసార్లు బ్రిటిషర్స్ డిసిప్లైన్ గురించి అనర్గళంగా ఉపన్యాసమిస్తాడు.

"అసలు ఈ స్వాతంత్ర్య మొచ్చాక ఆఫీసు డిసిప్లైను పాడైపోయిందయ్యా ! ఎక్కడ చూసినా ఇన్‌సబార్డినేషన్. మన ఎదురుగుండా మాట్లాడేది మనవాడే కదా అని ప్రతివాడికీ ధైర్యం. ఇదే బ్రిటిషర్స్ టైములో అయితే, వాళ్ళ ఉద్యోగాలు పీకేసేవాళ్ళు. ఈ స్వాతంత్ర్యానికి తోడు ఈ ట్రేడ్ యూనియన్ మూవ్‌మెంట్సు ఉద్యమాలు కూడానూ— ఆఖరికి కూలీ నాలీ వాళ్ళు కూడా ఊహు.... డబాయించి పడేయడమే. ఈ దేశం ఎప్పటికి బాగుపడుతుందో తెలియదు."

సూపరింటెండెంటు ఉపన్యాసాలకి బాగా అలవాటు పడిపోయారు స్టాఫ్ అంతా. ఆయన స్వరానికి తలలెప్పుడు సాగించాలో, ఆయన బుసలు కొట్టుతుంటే నాగస్వరమెలా ఊదాలో, ఆయన క్రింద పనిచేసే వాళ్ళందరికి తెలిసిపోయింది. ఆఫీసుకి రాగానే ఆయన ముఖం చూసి, ఆయన భార్య ఆయనతో పోట్లాట పెట్టుకుందో, లేకపోతే ఆయనే వాళ్ళావిడతో పోటాడేడో, వాళ్ళ ఇంట్లో, ముఖ్యంగా ఆయన జేబులో ఆర్థిక పరిస్థితి ఎట్లా ఉందో, క్లాసు తెచ్చుకుని ఉద్ధరిస్తాడనుకున్న వాళ్ల అబ్బాయి సరిగా చదువుతున్నాడో లేదో.... ఇల్లాంటివన్నీ ఊహించి ఏ సమాధానాలకి నోటింగ్ పెట్టుకోవడం ఆయన దగ్గర పని చేసే స్టాఫ్‌కి దిన చర్య.

"మీరంతా కో— ఆపరేట్ చేస్తే మన సెక్షనుని ఐడియల్‌గా తయారు చేస్తాను" అంటూండే వాడాయన.

అసలు వాళ్లంతా ఐడియల్ మనుషులు ఎప్పుడో అయిపోయినట్లు సెక్షను వాళ్లంతా ఆయన మాటలకి చిరునవ్వుకుంటూ ఉండేవారు.

"మీరు సిన్సియర్‌గా పని చెయ్యండి. మీమీద చక్కటి రిపోర్టు రిస్తాను. నా అంత మంచివాడిక ఎవడూ లేడనిపిస్తాను. ఒకవేళ తోక జాడించారో, నా అంత దుర్మార్గుడెవడూ ఉండడు. వెనక, ఓసారి ఓ కుర్రాణ్ణి ఒళ్లుమండి, మెమో ఇచ్చి, ఇంటికి పంపించేశాను."

కొత్తవాళ్లైతే ఆయన మాటలకి హడలిపోవలసిందే. రోజూ నో అరగంట ఇలా ఔషధ ప్రాయంగా ఈ పాఠాలు పుచ్చుకోవడం అలవాటయిపోయిన వాళ్ల మీద మాత్రం, ఇవేమంతగా పని చేయవు.

విశ్వనాథం కొత్తగా ఆంధ్రా ప్రాంతం నుంచి ట్రాన్స్ఫరు అయి హైదరాబాదు వచ్చాడు. సూపరింటెండెంటు విజయరాఘవ్ గురించి చాలా మంది చాలా రకాలుగా చెప్పుకోవడం విన్నాడే కాని ఆయన దగ్గర పని చేసే భాగ్యం అతనికి దొరకలేదు. వస్తూనే అతనిని విజయరాఘవ్ సెక్షనులో పోస్టు చేయడంతో "ఇదెందుకొచ్చిందో, ఏమో, మంచికో చెడుకో !" అనుకున్నాడతను. మామూలుగా బాస్ పట్ల చూపించవలసిన వినయం, విధేయతా చూపిస్తూనే ఉంటాడతను. ప్రొద్దున్నే విష్ చేయుటం దగ్గర్నుంచీ, సాయంత్రం గుడ్‌నైట్ చెప్పడం వరకూ అంతా యధావిధిగా చేస్తూనే వచ్చేవాడు. క్యాజయల్ లీవు అప్లికేషనులో 'యువర్స్ మోస్ట్ ఒబీడియంట్లీ' అనే వ్రాస్తూ ఉండే వాడు. చెప్పిన పని చెప్పగానే చూస్తూండేవాడు.

పాపం ! విశ్వనాథంలో ఇటీవల కొద్దిగా ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు పెరిగింది. డిపార్టుమెంటల్ పరీక్షలు ప్యాసవలేక పోవడమూ, చాలా మంది జూనియర్లకి తనకంటె ముందుగా ప్రమోషన్లు రావడం,.... ఇవన్నీ అతనికి కొంత బాధ కలిగించిన మాట నిజమే ! ఎన్నోసార్లు తనకున్న ఉద్యోగంతోనే తృప్తి చెందుదామనుకున్నాడు కాని, పెద్ద ఉద్యోగపు హోదా మీద మోజు కాకపోయినా, ఇంట్లో ఆర్థిక పరిస్థితి అతన్ని అలా చేయనిచ్చేది కాదు.

"పది, పన్నెండేళ్ల సర్వీసు పుటప్ చేశావు. కాని నీ డ్రాప్టింగ్ ఏం బాగా లేదయ్యా" అన్నాడు ఓసారి విజయరాఘవ్ విశ్వనాథంతో.

అతని గుండెల్లో రాయి పడింది. మొట్టమొదటిసారిగా, తన గురించి సూపరింటెండెంటు ఏమను కుంటున్నదీ అప్పుడే తెలుసుకున్నాడతను. ఎలాంటి సమాధానం చెప్పాలో అతనికి తెలియదు. అతనికి అంతముందెప్పుడూ అవసరం కూడా రాలేదు. ఏమనాలో తెలియక నవ్వాడు. కొంచెం ఇబ్బందికరంగా మొహం పెట్టి నవ్వాడు. నవ్వుతూ మిగతా వాళ్లకేసి చూశాడు. అందరూ ఫైళ్లలో తల దూర్చుకుని కూర్చున్నట్లే కనిపించింది. హెడ్ క్లార్కు ఆ వెళ్లిన కాగితం తన చేతి కలం మీదుగానే వెళ్లడం మూలానా ఇంకా ఏమవుతుందో, ఏమో నన్నట్లుగా కొంచెం ఆందోళన పడ్డాడు. సరోజ

కళ్ళు వోసారి వీళ్లనందరినీ చూసినా టైప్‌రైటరు లోంచి వేళ్ళు అప్పుడే బయటికి తీసుకుంటున్నట్లుగా నటించాయి.

*   *   *

విశ్వనాథం బక్కపలచగా చామన చాయలో ఉంటాడు. వయస్సు ముప్పై అయిదు కంటె ఎక్కువ లేక పోయినా నలభై ఏళ్ల వాడిలా కనిపిస్తాడు. పది, పన్నెండేళ్ల సర్వీసు వుందతనికి. ఇంట్లో సమస్యలూ, ముఖ్యంగా ఆర్థికమైన ఇబ్బందులూ, అతన్ని బాగా కృంగతీసిన మాట వాస్తవమే. ఆఫీసులో కూడా అప్పుడప్పుడు అతనికి ఇంటి ఆలోచనలు ఏవో ముసురుకుని వస్తూ ఉంటాయి. కొంత మటుక్కి సూపరింటెండెంటు విజయరాఘవ్ ఇది కనిపెట్టక పోలేదు. కనిపెట్టి ఆ సందర్భంలో ఒక పాఠం చెప్పకపోనూ లేదు.

''చూడు, మిస్టర్ విశ్వనాథం, ఏవో ప్రాబ్లమ్స్ ప్రతివాళ్లకీ ఉంటూనే ఉంటాయి. కాని అలా ఎక్కడపడితే అక్కడ వాటి గురించి వర్రీ అవకూడదు. ఇంటి విషయాలు ఇంటి దగ్గరా, ఆఫీసు విషయాలు ఆఫీసులోనూ విడిచిపెట్టి రెండో చోటికి వెళ్తూ ఉండాలి.''

విశ్వనాథానికున్న ముక్కుపొడుం అలవాటు కూడా విజయరాఘవ్‌కి కిట్టదు. ఆ విషయం ఒకటి రెండుసార్లు స్పష్టం చేశాడు కూడా !

''అబ్బబ్బ ! ఆ ముక్కుపొడుం మానెయ్యకూడదుటయ్యా ! పొగాకు పీల్చడమే చివరికి జరిగేది కాబట్టి శుభ్రంగా సిగరెట్లు అలవాటు చేసుకో కావలసివస్తే ! అంతేకాని ఈ ముక్కుపొడుం ఆఫీసులో పీలుస్తే నేను భరించలేను.

''సిగరెట్లు సీటులో కూర్చుని తాగితే, సరీ బాగోదని అలా బయటికి ఏ వరండాలోకైనా వెళ్లి తాగనేనా తాగుతారు. ఈ ముక్కుపొడుం అట్లా కూడా కాదు. అంతా సీటులోనే, ఎలాగైనా, యూ ప్లీజ్ ట్రై.''

ఆయన చెప్పడం సులువుగా చెప్పాడు కాని విశ్వనాథానికి అదేమంత సులభంగా తోచలేదు. చాలా ఏళ్ల నుంచి ఉన్న అలవాటాయె !

*   *   *

సూపరింటెండెంటు లేనప్పుడు మామూలుగానే ఆయన్ని గురించి పరోక్షంలో చెప్పుకోవలసినవి చెప్పుకోవడం సెక్షనులో అందరికీ అలవాటే. విశ్వనాథాన్ని అకారణంగా బాధ పెట్టడం పట్ల మిగతా వాళ్లంతా సానుభూతి వ్యక్తం చేశేవారు. ఆయన మాటలు కరుకుగా ఉంటాయి. కాని మనిషి మంచివాడేనని విశ్వనాథానికి కొంత మంది భరోసా ఇచ్చేవారు. వాళ్ల మాటలు అతనికి కొంత ధైర్యం కలిగించినా, బెదురు పూర్తిగా పోగొట్ట కలిగేవి కావు. ఏ గోడకి ఏం చెవులు ఉంటాయో అని అతను తనకుగా తాను సూపరింటెండెంటు గురించి చెడుగా ఏమీ మాట్లాడేవాడు కాదు.

ఓ గుమాస్తా మరొకణ్ణి అడిగాడు. ''ఆయన నది ఏదన్నా తినే తత్వమా ?'' అని.

''అబ్బెబ్బే కాదు. . . కాని. . . .'' అన్నాడు రెండో అతను.

''మరి ! . .'' మొదటి వాడు మళ్లీ ఏవో అనబోతూ ఉంటే సూపరింటెండెంటు సెక్షనులో అడుగు పెట్టాడు. స్టాఫ్ అంతా గబుక్కున ఫైళ్లలో మునిగి పోయారు.

*   *   *

'' మిస్టర్ విశ్వనాథం ! నువ్వు పని కొంచెం చురుగ్గా చేస్తూ ఉండాలయ్యా. అదే కాకుండా 'క్వాలిటీ ఆఫ్ వర్క్' కూడా కొంచెం 'ఇంప్రూవ్' చేయాలి. నీ నోటింగులు చప్ప చప్పగా ఉంటున్నాయి. ఆ మధ్యన ఓ సారి ఆఫీసరు కూడా అడిగాడు. ''ఈ నోటింగు ఎవరు రాసారూ'' అని. ఇదంతా నిన్నేదో బాధ పెట్టాలని ఇలా సతాయిస్తున్నాననుకోకు. నీ మేలు కోసమే చెప్తున్నాను. నా సలహాలు విని బాగుపడ్డవాళ్లే తప్ప పాడై పోయిన వాళ్లెవరూ లేరు. కొంచెం శ్రద్ధగా పని చేస్తూండవయ్యా !'' హితబోధ చేశాడు విజయరాఘవ్.

తన సెక్షన్‌లోకి వచ్చిన ఏ కాగితమైనా వారం తిరగకుండా డిస్పోజ్ అయిపోవాలంటాడు ఆయన.

'' ఎన్నో రిఫరెన్సులు ఉంటాయి. పాత కాగితాలన్నీ వెతికి కేసు అర్థం చేసుకొనేందుకే వారం రోజులు సరిపోవు '' అంటారు గుమాస్తాలందరూ. '' కొంచెం స్టాఫ్‌ని కూడా పెంచితే, పోనీ ప్రయత్నించి చూస్తాను.'' అన్నారు కూడా.

*   *   *

హెడ్‌క్లార్కు పరంధామయ్య వచ్చి చెప్పాడు సూపరింటెండెంటుతో, ఎస్టాబ్లిష్‌మెంటు సెక్షను వాళ్లు విశ్వనాథం మీద కాన్ఫిడెన్షియల్ రిపోర్టు అడుగుతున్నారని, అతను ఈసారి ఎఫిషెన్సీ బారు క్రాస్ చేసేది ఉంది కాబట్టి ముందుగానే రిపోర్టు రాసి ఇవ్వాలనీ.

సూపరింటెండెంటుకి, మనస్ఫూర్తిగా విశ్వనాథాన్ని 'ఎఫిషెన్సీ బార్' క్రాస్ చెయ్యనివ్వాలని లేదు. అతని గురించి తనకేమంత మంచి అభిప్రాయం లేదు. ఆ విషయం చూచాయగా హెడ్‌క్లార్కుతో అన్నాడు కూడా. '' ఏదో పిల్లలు కలవాడు — పోనిద్దురూ పాపం ! '' అని. పరంధామయ్య నచ్చచెప్పబోయాడు.

'' నీకు తెలియదయ్యా పరంధామయ్యా ! ఆఫీసులో ఇలాంటి కన్సిడరేషన్స్‌కి చోటు లేదు. కావలసివస్తే వేరే రకంగా ఉపకారం చెయ్యొచ్చునుకో— అయినా నేనిప్పుడిప్పుడే ఏమీ చెప్పలేను. నాలుగయిదు రోజులు పోయాక చూద్దాంలే. ఈ నాలుగు రోజులూ అతన్ని క్లోజ్‌గా వాచ్ చెయ్యాలి.''

*   *   *

కొద్దో గొప్పో, విశ్వనాథానికి భయంగానే ఉంది ఈసారి, సరిగా ఈ ఈ. బి. క్రాస్ చేసే టైముకి ఈ కొత్త సూపరింటెండెంటు దగ్గర వచ్చి పడ్డందుకు ఆయన ఏం చేస్తాడో, ఏమోనని కొంచెం హడలిపోతూ ఉండేవాడు.

ఆఫీసులో పరిస్థితి ఇలా ఉంటే ఇంటి పరిస్థితులు కూడా అంతంత మాత్రంగా ఉన్నాయి. విశ్వనాథం కొడుకుదీ, అతని ప్రక్క నెంబరు వాడిదీ పి. యు. సి. రిజల్ట్సు తర్వాత ప్రకటించబోతూన్నట్లు పేపర్లో పడింది. విశ్వనాథానికి చాలా చాలా కంగారు పుట్టింది. 'వీడేదో త్వరగా చదువుకుని వృద్ధిలోకి వస్తాడనుకుంటే ఇదేమిటిరా' అనుకున్నాడు ఆయన.

'' ఏదైనా కాపీ కొట్టావా ? చెప్పు అసలు ఏం జరిగిందో ? పోనీ నీ పేపర్లో నీ ప్రక్కవాడు కానీ కాపీ కొట్టాడా ? '' అని కొడుకుని దండించాడు. తనకేమీ తెలియదంటాడు ఎంతసేపటికి విశ్వనాథం కొడుకు. 'ఏదో జరిగే ఉంటుంది' అనుకున్నాడు విశ్వనాథం.

*   *   *

ఆ రోజున అందరూ జీతాలు పుచ్చుకున్నారు. నెల పొడుగునా కష్ట పడితే చేతిలో పడ్డ రాళ్లను జేబులో వేసుకుని అందరూ ఇళ్లకు బయలుదేరారు. దారిలో చాలా చాలా కాకతాళీయంగా సూపరింటెండెంటు, విశ్వనాథం కలుసుకున్నారు. ఇద్దరూ ఒకే దారిని పోతూండడంతో పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ నడిచారు. ఆఫీసు డాబూ, దర్పమూ విడిచి పెట్టి చాలా మామూలుగా విజయరాఘవ్ మాట్లాడేస్తూ ఉంటే విశ్వనాథానికి చాలా



# ఎఫిసెన్సీ బార్

ఆశ్చర్యం వేసింది. 'ప్రక్కన విశ్వనాథం ఉన్నాడు,' ఏం చేద్దామా ? అని ఓ క్షణం ఆలోచించినా 'ఫర్వాలేదులే' — అనుకుని విశ్వనాథంతో చెప్పాడు విజయరాఘవ్.

"నేను జీతం వచ్చిన రోజున ఒక్కసారి బారుకి పోతూ ఉంటాను." అని. హైదరాబాదు గురించి, కొంచెం తెలుసుకుంటూన్న విశ్వనాథం చలించలేదు. ఊ కొట్టాడు.

"నువ్వు కూడా రా. ఏదన్నా రుచి చూపిస్తాను" అన్నాడు విజయరాఘవ్.

"అబ్బెబ్బె వద్దండీ ! నాబోటి బీదవాణ్ణి ఇలాంటి వాటి జోలికిపోతే చాలా ఇబ్బంది పడాల్సి వస్తుంది." అన్నాడు విశ్వనాథం.

అతని మాటలు చెవిని పెట్టలేదు విజయరాఘవ్.

"నేను మటుక్కి అస్తమానం పోతానేవి టయ్యా ! జన్మానికి ఓ శివరాత్రి అన్నట్టుల్లగా నెలకొక్క రోజున పోతూంటాను. నీకంత భయంగా ఉంటే 'బీరుకాయ' మటుక్కి రుచి చూద్దువు గానిలే !" అన్నాడు.

విశ్వనాథానికి, బీరకాయ అనేదాంట్లో ప్రమాదం తక్కువ అన్నట్లు బోధపడింది.

"బీరు వంటికి చాలా మంచిదయ్యా ! కొంచెం కుంకుడు రసంలా చిరుచేదుగా ఉంటుంది. మత్తేమీ రాదు. ఫారినెర్స్ అయితే భోజనం దగ్గర మంచి నీళ్లు తాగరు. ఇదే పుచ్చుకుంటూ ఉంటారు."

విశ్వనాథానికి బెదురు పోలేదు.

"నేను చెప్తున్నాను కదయ్యా, అదేమీ చేయదని ! అందులో కార్బోహైడ్రేట్సు ఉన్నాయి. మాంఛి కాంప్లెక్షనూ, ఒళ్లూ వస్తాయి. అది రోజూ తాగినా తప్పులేదు."

వెడితే ఎట్లాగుంటుందో, వెళ్లకపోతే ఆయన ఏమనుకుంటాడో అని భయపడ్డాడు విశ్వనాథం.

చివరికి ఇద్దరూ వెళ్లి బారులో కూర్చున్నారు.

బీరు బాటిల్ తెప్పించాడు విజయరాఘవ్.

ఓ అర్థ గ్లాసుడు విశ్వనాథానికి పోశాడు. విశ్వనాథం అదే ఎక్కువ అనడంతో మిగతాదంతా తనే పుచ్చుకున్నాడు. ఇది కాక వేరే రెండు పెగ్గులు బిగించాడు. విజయరాఘవ్ విశ్వనాథానికి ఆ అనుభవం కొత్తగా ఉన్నా తనలో ఏమీ మార్పు లేనందుకు చాలా సంతోషించాడు. అంతకంటే పెద్దది ఏదో తీసుకున్న విజయరాఘవ్ కూడా మామూలుగానే ఉండి పోవడం అతనికి చాలా ఆశ్చర్యకరంగా ఉంది. బేరర్ బిల్లు పట్టుకొచ్చి టేబిలు మీద పెట్టాడు. ఇద్దరూ చేతులు జేబులో పెట్టారు కాని విశ్వనాథం చెయ్యి త్వరగా బయటికి వచ్చింది. బిల్లు కొంచెం బరువుగా ఉన్నా, శరీరం ఏమీ తేలిక కానందుకే సంతోషించాడు. విశ్వనాథం ఆ తర్వాత ఆ బారు అనుభవం ఎవళ్లకీ, ఎప్పుడూ చెప్పలేదు కూడా.

*   *   *

విశ్వనాథం కొడుకు పరీక్ష ప్యాసు అయినట్లు మళ్లీ పత్రికల్లో పడింది.

విశ్వనాథం ఎఫిసెన్సీ బార్ కాపీ చేయడానికి ఉపక్రమించ బోతున్నాడు !



## ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి కథల పోటీ

### ముగింపు తేదీ 1-10-'64

- నవంబర్ నెలలో వెలువడే ఆంధ్ర సచిత్ర వార పత్రిక తొలి సంచిక దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భంలో ఎప్పటికిమల్లే యీ ఏడాదికూడా 'కథలపోటీ' నిర్వహిస్తున్నాము. మంచి కథలకు మరింత ప్రోత్సాహం యిచ్చే నిమిత్తం బహుమతులను పెంచడం కూడా చేస్తున్నాము.
- మొత్తం మూడు బహుమతులుంటాయి. బహుమతి పొందిన కథలకు చెందిన సర్వహక్కులు, ఆంధ్ర సచిత్ర వారపత్రికవై వుంటాయి !

## మొదటి బహుమతి రు. 900 లు
## రెండవ బహుమతి రు. 500 లు
## మూడవ బహుమతి రు. 350 లు

- ఇతివృత్తం తెనుగు జీవితానికి సంబంధించినదై వుండాలి.
- కథ అరఠావు సైజు కాగితాలపై ఒకవేపు సిరాతో రాసిపంపాలి. పన్నెండు పుటలకు మించరాదు.
- పోటీకి గడువు అక్టోబర్ ఒకటవ తేదీ. అంటే మా కార్యాలయానికి అటుపై చేరిన రచనలు ఎంతమాత్రమూ పోటీకి స్వీకరింపబడవు. తమ తమ రచనలు తిరస్కరింపబడినప్పుడు తిరిగి పొందాలని కోరేవారు తమ రచనలతోనే తగినన్ని తపాలాబిళ్ళలు జతపర్చిన చిరునామాగల కవరులను పంపడం తప్పనిసరిగా భావించాలి.
- పోటీ విషయంలో ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అనువాదాలు, అనుకరణలు పనికిరావు. రచనలు సొంత రచనలై తీరాలి. సంపాదకుల నిర్ణయమే తుది నిర్ణయం.
- ప్రతీ రచయిత తన రచనలతోపాటు (1) కలం పేరుతో రాస్తే అసలు పేరు (2) కథ తన సొంతమేనని తెలిపే ఒక జాబు, పూర్తి చిరునామా విధిగా పంపాలని గ్రహించగోరుతున్నాము. పోస్టేజీ లేని రచనలు ఎంతమాత్రము తిప్పి పంపబడవు.
- పోటీలో బహుమతులను పొందిన కథలు మూడూ; నవంబర్ 6 దీపావళి ప్రత్యేక సంచికలో వేస్తాము. పోటీలో బహుమతులను పొందని కొన్ని రచనలను కూడా సచిత్ర వారపత్రిక ఇతర సంచికలలో ప్రచురణార్థం స్వీకరించడం జరిగితే ఆయా రచనలను మామూలు రచనలుగానే స్వీకరించడం జరుగుతుంది. వాటికి యథోచిత పారితోషికం యివ్వడం జరుగుతుంది.
- కవరుపై "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. రచనలు "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక: 7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1" చిరునామాకే పంపాలి. వ్యక్తుల పేర్లతో పంపే రచనలు ఎంతమాత్రమూ ఆమోదింపబడవు.

## 4-9-1964 శుక్రవారము మొదలు 10-9-1964 గురువారము వరకు.

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం మొత్తంమీద బాగానే ఉంటుంది. వ్యాపారంలో పనులు చురుకుగా సాగడంవలన ఆదాయం పెరగగల సూచనలు ఉన్నాయి. రావలసిన డబ్బు సమయానికి అందడంవలన అన్ని వ్యవహారాలు ఇబ్బందిలేకుండా సాగిపోతాయి. వృత్తిలో ఎన్నో అవకాశాలు ఇంద్ర ధనుస్సువలె కన్పిస్తాయి. కాని కార్యరూపం దాల్చడం కష్టం. ఉద్యోగం సంతృప్తికరంగా ఉంటుంది. పై అధికారులు మీ అభిప్రాయాలను ఆమోదించడంవలన సాటివారిలో గౌరవం లభిస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు : ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబంలో కార్యభారం పెరిగినా అన్ని పనులూ నిరాటంకంగా సాగిపోతాయి.

5, 6 10 తేదీలు మంచివి. 7, 8, 9 తేదీలు మంచివికావు.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

ఈ వారం అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి గాని ఆర్థికంగా ఒడుదుడుకులు రావచ్చును. వ్యాపారంలో డబ్బు సర్దుబాటు కాక లాభం రావలసిన వ్యవహారాలుకూడ వదలివేయవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. వృత్తిలో సాటివారితో పోటీ తగ్గడంవలన మీ పరిస్థితి చాల వరకు సంతృప్తికరంగా ఉంటుంది. ఉద్యోగ పరిస్థితిలో మార్పులు రావు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును. ఇంతవరకు మిమ్మల్ని వ్యతిరేకించిన వారుకూడా మిమ్మల్ని బలపరుస్తారు. వైజ్ఞానిక కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు : ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పిస్తుంది. బంధు సమావేశాల్లో పాల్గొంటారు.

7, 8 తేదీలు మంచివి. 10వ తేదీ మంచిదికాదు.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

కొన్ని వ్యవహారాలు అరచేతిలో నిమ్మపండువలె కన్పిస్తాయిగాని ప్రయత్నించడంవలన ప్రయాస తప్ప ప్రయోజనం ఉండదు. వ్యాపారంలో శ్రమా వ్యయం పెరుగుతాయి. ఆదాయం పెరిగినా, వ్యయం కూడ పెరగడంవలన అంత సంతృప్తికరంగా ఉండదు. వృత్తి ఉద్యోగాలు బాగానే ఉంటాయి. కాని ఏమాత్రం ఏమరుపాటు చూపినా చికాకులు రావచ్చును. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఆకస్మికంగా చికాకులు వస్తాయి. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | | గు | రా |
| శ | వారఫలం | | చం కు శు |
| | మహేష్ | | ర బు |
| కే | | | |

స్త్రీలకు : ఆరోగ్యం బాగావున్నా వారం ప్రారంభంలో ఆందోళన కలగవచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

4, 9, 10 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

వృత్తి వ్యాపారాల్లో వారారంభంలో కనిపించిన అనుకూలత వారాంతానికి నిలవడం కష్టం. వ్యాపారంలో మీకు ఇష్టంకాని పరిస్థితి ఏర్పడినా, ఆర్థికంగా మాత్రం బాగానే ఉంటుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు రాణించడానికి అవకాశం ఉంది. వృత్తి ఉద్యోగాల్లో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి ఇది సమయంకాదు. మీరు ఇంతవరకు రాదనుకున్న డబ్బుకూడా చేతికి వస్తుంది. ఆరోగ్యం అంత బాగా ఉండదు. సాంఘిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

స్త్రీలకు : ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతోష వార్తలు వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

4, 5, 6 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో వ్యయప్రయాసలు ఎక్కువైనా తగిన ప్రతిఫలం ఉండటంవలన ఈ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో ముమ్ముందు ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడుతాయి. కొన్ని వ్యవహారాలు మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా అనవసర వ్యయం చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని సంతానానికి కించిదనారోగ్యం చేయవచ్చును. వైజ్ఞానిక రంగంలో మీ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. నూతన విషయాలను తెల్సుకుంటారు.

స్త్రీలకు : ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. సాంఘిక కార్యక్రమాలు నిరాటంకంగా సాగిపోతాయి.

5, 6, 7, 8 తేదీలు మంచివి. 4వ తేదీ మంచిదికాదు.

> **సూచన**
>
> నూతన వ్యవహారాలు ప్రారంభించడానికీ, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉన్నా ఏదో ఒక కారణంచేత మానసికాందోళన కలుగుతుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో మార్పులు రాకపోయినా, సాటి వారితో భేదాభిప్రాయాలు రాగల సూచనలున్నాయి. కొన్ని వ్యవహారాల్లో డబ్బు చిక్కుబడిపోవడంవలన సులువుగా నెరవేరే వ్యవహారాలను గురించికూడా ఎంతో ఆలోచించవలసి ఉంటుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు.

స్త్రీలకు : ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాల్లో కొన్ని మార్పులు వస్తాయి. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

5, 6 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

ఈ వారం మొత్తంమీద బాగానే ఉంటుంది కానీ కార్యసాధనకోసం మీకు అంతగా ఇష్టంలేని వ్యక్తులతో సన్నిహితంగా వ్యవహరించవలసిన పరిస్థితి ఏర్పడటంవలన అంత సంతృప్తికరంగా కన్పించదు. వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు ఏర్పడిన అనిశ్చిత పరిస్థితి తొలగిపోతుంది. ఆర్థికంగా ఈ వారం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో కొన్ని మార్పులు రావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు : ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

5, 6, 10 తేదీలు మంచివి. 7, 8, తేదీలు మంచివికావు.

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో కొన్ని చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి. గాని మీరు సమయోచితంగా వ్యవహరించడంవలన వాటిని అధిగమించగలుగుతారు. కాకుండా తగిన అభివృద్ధిని సాధించగలరు. దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే వ్యవహారాలు ప్రారంభించడానికి


S&N



# వారఫలం

మంచి సమయం. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి అనుకూలంగా ఉంటుంది. ఈ వారంలో మీరు చేసే నిర్ణయాలు సరియైనవని భవిష్యత్తు నిరూపిస్తుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు : ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

9, 10 తేదీలు మంచివికావు. మిగిలిన తేదీలు మంచివి.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈ వారం బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. ప్రతి క్షణమూ హోరాహోరిగా పోరాడితే తప్ప ఏ కార్యమూ సాధింపలేరు. వృత్తి వ్యాపారాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. మీరు ఇప్పుడు జరిపే వ్యవహారాల్లో కొంత డబ్బు చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయంలు వస్తాయి. భారీ వ్యాపారాలు చేయడానికి ఇది సమయం కాదు. ఉద్యోగంలో అపకారం ఏమీ జరగదు కాని వ్యతిరేక వాతావరణం ఏర్పడంవలన మనశ్శాంతి లభించదు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు.

స్త్రీలకు : ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాహిత్య వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. శుభకార్యాల విషయంలో అనుకూల వార్తలు వింటారు.

4వ తేదీ మంచిదికాదు. మిగిలిన తేదీలు మంచివి.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈ వారం ప్రారంభంలోనే కొన్ని వ్యవహారాల్లో మానసికాందోళన కలగవచ్చును. కాని, మొత్తం మీద సంతృప్తికరంగానే ఉంటుంది. వారం మధ్యనుంచి వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో ఇదివరకు ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. ఉద్యోగంలో అధికారుల మంచితనం లభిస్తుంది కాని సాటివారి అసూయకు గురికాగల సూచనలున్నాయి. కోర్టు వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. పుణ్యకార్యాలు నెరవేరుతాయి.

స్త్రీలకు : ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మామూలుగా ఉంటాయి. బంధువులకు సహాయంచేస్తారు.

5, 6 తేదీలు చెడ్డవి. మిగిలినవి తేదీలు మంచివి.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

ఈవారం అన్నివిధాలా జాగ్రత్తగా ఉండవలసిన సమయం. మీరు ఎంతో కృషిచేసి ఒక దారికి తెచ్చిన వ్యవహారాల్లో కూడా ఫలితం చేతికి రాబోయే సరికి మరల అటంకాలు రావచ్చును. వృత్తి వ్యాపారాల్లో మీరు ఎంత మంచిగా ప్రవర్తించినా అది ఇతరులకు చెడుగానే కన్పిస్తుంది. ముఖ్య వ్యవహారాలు

భాగస్వాములు నిర్ణయానికి వదిలిపెట్టడం మంచిది. ఉద్యోగంలో వ్యతిరేకత ఏమీ లేకపోయినా కార్యభారం మాత్రం పెరుగుతుంది. ఉష్ణ సంబంధమైన అనారోగ్యంచేస్తుంది. రాజకీయాల్లో కొన్ని హఠాత్పరిణామాలవల్ల అనుకూలత జరగవచ్చును.

స్త్రీలకు : బంధుమిత్రులతో భేదాభిప్రాయాలు వస్తాయి. సంతానానికి కొంచెం అనారోగ్యం చేస్తుంది. ప్రయాణాలోచనలు రావచ్చును.

5, 6, 10 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

అన్ని వ్యవహారాలు అనుకూలంగా కన్పించినా సాహసించి ఏ పని ప్రారంభించడానికి సమయంకాదు. వ్యాపారంలో ప్రయాస మీది, ప్రయోజనం మరొకరిది కాగల పరిస్థితి ఏర్పడవచ్చును. వృత్తిలో చెప్పతగిన మార్పులు రావు. కాని స్వల్పంగా ఆదాయం పెరగవచ్చును. ఉద్యోగంలో మీకు వ్యతిరేకంగా ఒక ఉద్యమంవంటిది రాగల సూచనలు ఉన్నాయి. ప్రయాణం ద్వారా ముఖ్యమైన పనులు సాధిస్తారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువులు మాత్రం కాళ్లమీదపడి వేళ్ల కరచేలా విధంగా ప్రవర్తిస్తారు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు : ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు. సాంఘిక కార్యక్రమాలు అంత బాగా ఉండవు.

4, 7, 8 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు. ★

# జన్మదినఫలం

## సెప్టెంబరు-4

ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే కొంచెం బాగా ఉంటుంది. వ్యాపారంలో కొంత శ్రమమీద అభివృద్ధిని సాధిస్తారు. ఎప్పుడూ ఏదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తూ ఉండడంవలన పరిస్థితి సంతృప్తికరంగా కనిపిస్తుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు ప్రారంభించడానికి సమయం కాదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో ఇంతవరకూ ఉన్న పోటీ తగ్గగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో విశేషమైన ప్రయోజనం ఏమీ లేకపోయినా అందరి చేతా మీ శక్తి సామర్థ్యాలు గుర్తింపబడతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన చిక్కులు చాలవరకు తొలగిపోతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయాల్లో ప్రయోజనకరమైన మార్పులు వస్తాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## సెప్టెంబరు-5

ఇతరుల దృష్టిలో ఈ సంవత్సరం మీకు యోగవంతమైనదే కాని మీకు మాత్రం సంతృప్తికరంగా కన్పించదు. ఇతరుల నిమిత్తం ఏ వ్యవహారంలో ప్రయత్నం చేసినా నిర్విఘ్నంగా కొనసాగుతుంది. కాని మీ స్వంత వ్యవహారాలకు ఎన్నో ఆటంకాలు వస్తూ ఉంటాయి. ప్రతి వ్యవహారంలోనూ అనవసరమైన వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది. వృత్తిలో పోటీ పెరగడంవలన మీరు పొందవలసిన లాభాన్ని కూడా పొందలేని పరిస్థితి ఏర్పడుతుంది. ఉద్యోగంలో పై అధికారులతో అభిప్రాయభేదాలు వస్తాయి. ప్రతి వ్యవహారంలోను జాగ్రత్త చాలా అవసరం. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావు. సాంఘిక వ్యవహారాల్లో పలుకుబడి పెరుగుతుంది. విద్యార్థులు మొదటినుంచి శ్రద్ధగా చదవడం మంచిది.

## సెప్టెంబరు-6

ఈ సంవత్సరం చిత్రంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీకు ఇష్టంకాని పరిస్థితుల్లో వ్యవహరించవలసి వస్తుంది. ఆర్థికంగా బాగా ఉన్నా మిగిలిన పరిస్థితులు బాగా ఉండకపోవచ్చును. మీరు ప్రయత్నంచేసిన పనులకు ఆటంకాలు రావడం, సాధ్యంకానని విడిచిపెట్టిన వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరగవచ్చును. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీ ఎదుట పొగడుతూ, చాటున దూషిస్తూ ఉంటారు. ఉద్యోగంలో మీకు అనుకూలంగా కొన్ని మార్పులు సంవత్సరం మధ్యలో రావచ్చును. కోర్టు వ్యవహారాల్లో ఇంతవరకు ఉన్న వ్యతిరేకత తగ్గుతుంది. రాబోయే సహాయాన్ని నమ్మి ఏ వ్యవహారమూ ప్రారంభించడం మంచిదికాదు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఆకస్మికంగా కొన్ని చిక్కులు వస్తాయి. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉంటాయి.

## సెప్టెంబరు-7

ఈ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. సంవత్సర ప్రారంభంలో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా కన్పించినా రానురాను కొన్ని చికాకులు కలగవచ్చును. కొన్ని వ్యవహారాల్లో లాభం వచ్చినా మరికొన్ని వ్యవహారాల్లో నష్టం రావడంవలన మిగిలినదని చెప్పడానికి ఏమీ ఉండకపోవచ్చును. వృత్తిలో పోటీ పెరుగుతుంది. సంవత్సరాంతంలో మీ స్థానాన్ని నిలుపుకొనడానికే శ్రమపడవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ ఆలోచనలకు తగిన అవకాశం చిక్కదు. అవకాశం చిక్కినప్పుడు ఆలోచన రాదు. మొత్తంమీద అసంతృప్తికరంగా ఉంటుంది. సంవత్సరం మధ్యలో ఆకస్మికంగా అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు శ్రమమీద నెరవేరతాయి. రాజకీయాల్లో ప్రతిపక్షం బలహీనపడడంవలన మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉండవచ్చును. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

## సెప్టెంబరు-8

ఈ సంవత్సరం అంత బాగా ఉండదు. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉండవు. ఇతరులతాలూకు వ్యవహారాలు మీరు నిర్వహించడంవలన మీ స్వంతపనులు చూడడానికి అవకాశంలేని పరిస్థితి ఏర్పడవచ్చును. చిన్న పనికి కూడా పెద్ద ప్రయత్నం చేయవలసి వస్తుంది. సంవత్సరం మధ్యలో మీరు అంతకుముందు జరిపిన వ్యవహారాల్లో చిక్కులు రావచ్చును. ఉద్యోగంలో ఏ క్షణం ఏమి జరుగుతుందో అనే ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి ఇది సమయంకాదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కాని, మానసికాందోళన కలుగుతూ ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటికంటె బాగా ఉంటాయి. వృత్తిరీత్యా, చేయవలసిన దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. విద్యార్థులు చాలా శ్రమమీద సారథ్యంగా కృతార్థులు కాగలరు.

## సెప్టెంబరు-9

మానసికంగా ఈ సంవత్సరం అసంతృప్తికరంగా ఉన్నా, వ్యావహారికంగా బాగానే ఉంటుంది. కార్యసిద్ధికోసం మీరు కొంతమంది అవాంఛనీయులైన వ్యక్తులతో వ్యవహరించడంవలన మీ మిత్రులు మిమ్మల్ని అపార్థం చేసుకొనే ప్రమాదం ఉంది. ఆరంభంలో కొన్ని సందేహాలు కలిగినా, మీరు ప్రయత్నించిన ప్రతి పనీ నెరవేరే అవకాశం ఉంది. వృత్తిలో కొన్ని మార్పులు రావడంవలన ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్చబడవచ్చును. కొన్ని వ్యవహారాల్లో మీ డబ్బు చిక్కుబడి పోతుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. ఇంతవరకు భిన్నాభిప్రాయాలుగల బంధువులను ఒక దారికి తీసికొని రాగలరు. స్త్రీ మూలంగా కలహం రాగల సూచనలు ఉన్నాయి. సాంఘిక వ్యవహారాలు అంత బాగా ఉండవు. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉండవచ్చును.

## సెప్టెంబరు-10

ఈ సంవత్సరం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. మీరు గత సంవత్సరం ప్రయత్నించి నిరాశ చెందిన వ్యవహారాలు కూడా ఇప్పుడు నెరవేరతాయి. వృత్తివ్యాపారాల్లో అధికులతో పరిచయం లభిస్తుంది. దానివల్ల కేవలం ప్రస్తుత ప్రయోజనమే కాకుండా భవిష్యత్తులో చాలా ఉపయోగం ఉంటుంది. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరణ లభిస్తుంది. ఉన్నతస్థానం కోసం చేసే ప్రయత్నాలు ఫలించగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మాత్రం కొత్త చిక్కులు రావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మామూలుగా ఉంటాయి. బంధువుల వ్యవహారాల్లో శ్రమపడి కృషిచేసినా నిష్ఫారం రావచ్చును. రాజకీయాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు. ★




## జరిగిన కథ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాధను చెపుతూవుంటుంది... జానకి, సీత అక్కచెల్లెళ్ళు. జానకీ రామారావులకు పెళ్ళవుతుంది. జానకికీ, చనిపోయిన చినమామయ్యకీ సంబంధం వుందన్న కోపంతో రామారావు ఆమెను చిన్నచూపు చూస్తాడు. భార్యాభర్తల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు రావటంతో, జానకి తానాశించిన ఆనందాన్ని పొందలేకపోతుంది.

## 4

సీత మళ్ళీ చెప్పసాగింది—

"సీతా, మానవ మనస్తత్వాలు అనేక తీరులుగా ఉంటయ్యి. కొంతమందికి సరిగ్గా అయిదు వేళ్ళు నోట్లోకి పోవు. వాళ్ళ ఇళ్ళు చూస్తుంటే వాళ్ళ తాహతు ఎటువంటిదయిందీ తెలుస్తుంది. ఒక్క గది ఇంటిల్లా ఉన్న భాగాల్లో అద్దెలు పెట్టుకోలేక, నలుగురు పిల్లలున్నా సరిపెట్టుకుంటారు. వండుకోటానికి సరయిన పాత్రసామానులుండవు. పట్టుమని నలుగురు చుట్టాలొస్తే తాగటానికి గ్లాసులుండవు. ఎటు చూసినా దణ్ణాలమీద చిరిగిపోయిన బట్టలూ, మాసిన బట్టలూ వేలాడుతూ ఉంటయ్యి. సరయిన పక్కబట్టలుండవు. కంపుకొట్టుకుంటూ రెండు జంపకానాలూ, రెండు దుప్పట్లున్నా ఎక్కువ ఉండవు. ఆ దిళ్ళకు గలీబులు లేక తలనూనె మురికిపట్టి వాసన వేస్తూ ఉంటయి. నవారు ఎంచాలయినా లేకుండా నులకమంచాల్లో, కుక్కి మంచాల్లో కాపురాలు చేస్తుంటారు. అట్లా బీదరికంలో ఉన్నా, చాలీచాలని జీతాలతో, కాలం వెళ్ళబుచ్చుతున్నా, ఆ దంపతులు ఎంతో అన్యోన్యంగా, ఆపేక్షగా ఉంటారు. ఉన్నంతనే తిని అప్పో, సప్పోచేసినా, కనీసం వారానికోసారయినా, ఎంతో ముచ్చటగా ముస్తాబయి, చీకూచింతా లేకుండా సినిమాకి పోతారు. రోజూ మడ్డిగారుకుంటూ ఉండే ఆ యిల్లాలు ఆవాళ చూడ ముచ్చటగా ఉంటుంది. వంటిమీద చిరిగిన చొక్కాలతో మట్టిలో ఆడుకునే ఆ పిల్లలు, ఆవాళ దొర బాబుల్లా ఉంటారు. వాళ్ళదే నిజమైన ఆదర్శ దాంపత్యం. అనుకూల దాంపత్యం. వారి గృహ జీవితంలో ఆ రోజున నవ వసంతాలు గుభాళిస్తాయి. తృప్తిగా, ఆనందంగా ఒకరి హృదయాల్లో మరొకరు ఇమిడిపోతారు. కాని సీతా! అలాంటి జీవితానికికూడా నోచుకోలేకపోయాను నేను. ఆరోజు అటువంటిది. వారితో రిక్షాలో కూర్చుని పోతూంటే నా మనస్సు ఆనందంతో పరవళ్ళు త్రొక్కింది. నేనూ అదృష్టవంతురాలినే అనుకున్నాను. నేనూ ఆదర్శ దాంపత్య జీవితం గడుపుతున్నాననుకున్నాను. నేనూ లెక్చరరుగారి భార్యని, చదువుకున్నదాన్ని. కాని అనుభవానికి నోచుకోలేదు" అన్నది అక్కయ్య.

"ఏం జరిగింది. సినిమాకు వెళ్ళలేదా" అన్నాను ఆదుర్దాగా.

"సినిమాకు వెళ్ళాం. బాల్కనీలో కూర్చున్నాం. వారిపక్కనే కుర్చీలో కూర్చున్నాను. నాది ఆఖరు కుర్చీ. నాముందు కుర్చీల్లో అంతా మగవాళ్ళే కూర్చున్నారు. సినిమా ప్రారంభించారు. వారి పక్కన కూర్చుని సంతోషంతో సినిమా చూస్తున్నాను. ఇంటర్వల్ అయింది. లైట్లు వెలిగాయి. నా ముందు కూర్చున్నతను లేచి నిల్చున్నాడు. వెనక్కి చూశాడు. సాధారణంగా సినిమాకు వెళ్ళినప్పుడు కొంతమందికి వెనక్కి తిరిగి చూట్టం అలవాటు. ఎరుగున్న వాళ్ళెవరైనా వచ్చారేమో చూద్దామని చూసేవాళ్ళు కొంతమంది. ఎంతమంది ఆడవాళ్ళు వచ్చారో చూద్దామని చూసే వాళ్ళు కొంతమంది. ఎవరి ఆలోచనలు వాళ్ళవి. అందర్నీ అందరూ సమర్థించలేరు; ఎవరి ఇష్టాలు వాళ్ళవి. ముందు కూర్చున్న వాళ్ళు వెనక కూర్చున్న వాళ్ళని చూడకూడదనే చట్టంలేదు కదా. అట్లాగే అతనూ చూశాడు. చూస్తూనే "ఏమండీ. కుశాసా. సినిమాకొచ్చారా" అని మందహాసం చేసి మళ్ళా మామూలుగా తన కుర్చీలో కూర్చున్నాడు. నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తినయ్యి. ఖంగారుపడ్డాను. అతన్ని వారు చూశారు. నాతో మాట్లాట్టం చూశారు. మ్రుభావకంగా వూరుకున్నారు. సినిమా ఎప్పుడయిందో నాకు గుర్తులేదు. ఇంటికి వెళ్ళాము. రిక్షాలో కూర్చున్నంత సేపూ వారు నాతో మాట్లాడలేదు.

నేను ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని కూర్చున్నాను. ఆ రాత్రి ఎవరం భోంచెయ్యలేదు. పడక గదిలోకి వెళ్లాకకూడా వారు నాతో మాట్లాడలేదు. మంచంమీద గోడ వైపుకు తిరిగి పడుకున్నారు. మంచంమీద కూర్చుని మీద చెయ్యి వేసి "ఇటు తిరగరూ" అన్నాను. నా వైపుకు తిరక్కుండానే "అతనెవరు" అన్నారు. ఇటు తిరగండి చెప్తాను, అన్నాను ధైర్యంచేసి. నా జీవితంలో అడుగడుగునా అగ్ని పరీక్షలే. నా వైపుకు తిరిగి చెప్పమన్నట్లుగా నా వైపు చూశారు "సినిమాలో కనపించినతనేగా. ఇంటరులో ఏలూరులో నా క్లాసుమేట్. ఎరుగున్నవాళ్లం గనుక పలకరించాడు. అతను పలకరించినా నేనేం సమాధానం చెప్పలేదే" అన్నాను" అన్నది అక్కయ్య.

"అప్పుడేమన్నారు బావ" అన్నాను నేనూ ఆదుర్దాగా.

"అట్లాగా. పాపం. నంగనాచివి. మీరిద్దరూ కూడబలుక్కునే వచ్చారని నా ఉద్దేశ్యం. నువ్వు మాట్లాడలేదన్నావు. అవునుమరి. పాత కంపేగా. ఆ సమయంలో అంతకన్నా కబుర్లు ఏముంటయ్యి. అందుకనే అతని వెనక కుర్చీలో కూర్చున్నావు. సిగ్గు లేకపోతే సరి ముఖానికి. ఇంత బరి తెగించి ప్రవర్తిస్తావనుకోలేదు. ఛీ ! నీ ముఖం చూడకూడదు. ఇంతకన్నా చస్తే నీకు నాకూ మనశ్శాంతి అయినా ఉంటుంది" అని అంటూనే నన్ను కిందికి నెట్టేశారు. మంచంమీదినుంచీ కింద పడ్డాను. ప్రాణం పోయినా బాగుండేది. నుదురుకు దెబ్బ తగిలి బొప్పి కట్టింది. మోచెయ్యి కొట్టుకుపోయింది. ఎత్తు పందిరి మంచం కావటంనుంచి ఆ దెబ్బలు తగిలినయ్యి.'' అని కళ్లు తుడుచుకుంది అక్కయ్య—

సీత ఈ విషయాలు చెపుతుంటే రాధ నిర్విణ్ణురాలై వింటున్నది. చెప్పటం ఆపి సీత రాధవైపు చూసింది.

"ఏం రాధా, ఎట్లావుంది అక్కయ్య జీవిత చరిత్ర" అన్నది సీత.

"ఎట్లా ఉన్నదని చెప్పను. ఈ విషయాలన్నీ వింటుంటే అసలు ఆడదానికి పెళ్లిమీద ఇష్టం తగ్గిపోతుందేమో? అత్తింటి కాపురం చేసేవాళ్లు వున్నారుగాని మీ బావలాంటి వాళ్ళు చాలా అరుదుగానే కనిపిస్తారు." అన్నది రాధ.

"అవును రాధా. అక్కయ్య చెప్పిన మాటలు వింటుంటే బావ అంత నీచుడా అనిపించింది. కావటానికి ఎమ్. కాం. ప్యాసయాడు. కాలేజీలో లెక్చరరు. రెండువందల ఏభై జీతం. సూటూ, బూటూ వేసుకుని టై కట్టుకుని తల పదిసార్లు. నొక్కులు నొక్కులుగా దువ్వి చక్కగా సైకిలు మీద కాలేజీకి వెడతారు. మనస్సులో, హృదయంలో ఏ కోశానా ఇంగిత జ్ఞానంలేదు. అర్థంలేని అనుమానంతో సంసార జీవితం ప్రారంభించారు. జరిగే సంఘటనలన్నీ ఆ అనుమానాల్ని బలపరుస్తూనే ఉన్నయ్యి. నాకు బావమీద గౌరవం పోయింది. అక్క కాబట్టి వూరుకున్నది. నేనైతేనా, తగిన బుద్ధి చెబుదును అనుకున్నాను. కాని నేను చెయ్యగలిగిందేమిటి? నా ప్రశ్నకు అప్పుడు నాకే సమాధానం దొరకలేదు. హీన మర్యాదలకు తలఒగ్గి సంచరించే అక్కయ్య మరి ఏంచేస్తుంది?" అన్నది సీత.

"ఎవరయినా ఏంచేసేది లేదు. తెగించిన వాళ్లయితే తెగతెంపులు చేసుకుంటారు కాని అది ఏమంత ఘనకార్యమైన పని" అన్నది రాధ.

"అక్కయ్య ఇంక చెప్పలేకపోయింది. నాకూ మనస్సు వికలమై పోయి యింకా వినలేకపోయాను. అక్కయ్య కళ్లు మూసుకుని పడుకుంది. నేను మాట్లాడలేదు. తెల్లవారుఝాముకి నాకు నిద్ర పట్టింది" అని చెప్పటం ఆపింది సీత.

"మీ చిన్న మావయ్య భార్యాపిల్లలు ఎక్కడున్నారు" అన్నది రాధ.

"చిన్న మావయ్య భార్యాపిల్లలూ ఇప్పుడు రాజమండ్రిలో ఉన్నారు. పొలాలమీద డబ్బుతో కాలం గడుపుతున్నారు" అన్నది సీత.

"చేతికొచ్చిన పిల్లలు లేరా"

"పెద్దవాడు సెకండ్ ఫారం చదువుతున్నాడు."

"పాపం ! వూఁ తరువాత"

సీత మళ్లా చెప్పసాగింది—

"మర్నాడు నిద్ర లేచేసరికి మా ఇద్దరి కళ్లూ ఎర్రబడి వాచినయ్యి. మా ఇద్దర్నీచూసి అమ్మ ఖంగారు పడింది. అదేమిటే సీతా, ఇద్దరి కళ్లూ అట్లా వాచి ఎర్రబడినయ్యి, నిన్న పేరంటంలో ఇద్దరూ పట్టు చీరెలు కట్టుకుని అమ్మ తల్లులల్లె తిరుగుతుంటే ఏ దిష్టి దిబ్బలో తగిలిందేమో" అన్నది అమ్మ. మాకు నవ్వూ, విచారమూ కలిగినయ్యి. అమ్మ మా ఇద్దర్నీచూసి ఖంగారుపడసాగింది.

"ఏం లేదమ్మా, ఏవో కబుర్లు చెప్పుకుంటూ రాత్రి చాలా పొద్దుపోయాక నిద్రపోయాము. అందుకని నిద్ర చాలక కళ్లు వాచినయ్యి. అంత సుకుమారి మొద్దు శరీరాలే మావి" అన్నాను నవ్వుతూ, అమ్మతో. అక్కయ్యకూడా నాతో ఏకీభవించింది. అక్కయ్య సంసార గొడవలు వినేసరికి నాకు కళ్లు వాచినయ్యి. అమ్మయితే మంచమెక్కేదేనేమో.

"మర్నాడు రాత్రి మళ్లా అక్కయ్య తన గాథ చెప్పసాగింది. సీతా ! పుణ్యచరిత్రలు వింటే, భక్తి, ముక్తి ఉంటుందంటారు. భక్తి, ముక్తి కోసమని పుణ్యచరిత్రలు కొంతమంది వింటారు. వాటిల్లోని సారంగాని, తెల్సుకోవలసిన విషయాలు విని తెల్సుకోటానికిగాని, కొంతమంది పురాణాలకు పోతారు. కొంతమంది కాలక్షేపానికి పోతారు. ఇంక పాపుల చరిత్ర వినేవారు కొంతమంది. ఆ పాప చరిత్ర వినటంవల్లనే తామేదో రహస్యాలు తెలుసుకున్నట్లూ, ఘనకార్యం చేసినట్లూ భావిస్తారు కొంతమంది. మరికొంతమంది ఇతరుల జీవిత విషయాల్లో జోక్యం కలిగించుకుని, వారి కష్టాలనే తమ కష్టాలుగా భావించి సానుభూతిని చూపటమో తమకు చేతనైన సాయం చెయ్యటమో చేస్తుంటారు. ఈ నిర్భాగ్యురాలైన అక్కయ్య జీవిత కథ విని నా కష్టాలు ఏ విధంగా ఈడేర్చగల ఓ తగిన సలహా చెప్పవే సీతా" అన్నది అక్కయ్య.

అక్కయ్యకు నేనేం సహాయం చెయ్యగలను. ఏం సలహా చెప్పగలను ?

సీత రాధ వైపు చూస్తూ కూర్చుంది.

"సీతా ! మనకు సన్నిహితులైన వారిలో ఒక చెడ్డ గుణం కనిపించినప్పుడు, అయ్యో ! పాపం, పాడయిపోతున్నారే అని సానుభూతి కనబరుస్తాం. ఆ వ్యక్తి చెడ్డపని చేస్తున్నారని తెల్సినా కొంత కాలం సానుభూతి చూపగలుగుతాం. ఆ వ్యక్తిలో ఆ చెడ్డతనమే జీర్ణించిపోతే ఇంక ఆ వ్యక్తి బాగుపడటంకల్ల అనుకుని, ఒక్క నిట్టూర్పు విడిచి, ఒక రకమైన ఏహ్య భావాన్ని, ఆ వ్యక్తిని గురించి మన మనస్సులో చిత్రించుకుంటాం. సానుభూతికూడా అంతే. మనకు సన్నిహితులైనవారి కష్టాలు మనం మొదట్లో విన్నప్పుడు, ఆ కష్టాలే మన కష్టాలుగా తల్చుకుని, వాళ్లతోబాటుగా మనమూ బాధ పడుతాం. ఆ కష్టాలే వదలక, పీడిస్తుంటే అప్పుడు కర్మ సిద్ధాంతాన్ని స్మరించక తప్పదు. మీ అక్కయ్య జీవితచరిత్ర ఇంతవరకూ వింటున్నదాన్ని బట్టిచూస్తే జాలిపడి, కర్మ సిద్ధాంతాన్ని పాటించడం తప్ప ఇతరులు చెయ్యగలిగిన సహాయం ఏం లేనట్లుగానే తోస్తున్నది." అన్నది రాధ.

సీత కొద్దిగా నవ్వి, "నీకూ అట్లాగే అనిపించిందా రాధా" అన్నది. రాధ ఏమీ అనలేదు.

సీత మళ్లా చెప్పసాగింది.—

అక్కయ్య మళ్లా ఇట్లు చెప్పింది. "ఆ విధంగా వారు నన్ను కిందకి నెట్టివేసేసరికి, కిందపడ్డాను. నా ముఖాన బొప్పి కట్టింది. కుడిచెయ్యి ఎత్తనివ్వలేదు. నా పరిస్థితి చూసి సుభద్ర నవ్వసాగింది. సుభద్రకు ఏ సమయంలో, ఏం అనవచ్చో, ఏ మాట అనకూడదో తెలీదు. ఆ మాటలకూ, హాస్యానికీ అర్థంలేదు" అన్నది అక్కయ్య.

"ఏమన్నదేమిటి సుభద్ర" అని అడిగాను.

"ఏం చెప్పనే సీతా, వదినా, వదినా వల్లంకిపిట్ట గదిలో పెట్ట గంజినీళ్లు పొయ్య, మా అన్న కొట్ట, సువ్వేడన, నేనవ్వ—అంటూ చప్పట్లుకొట్టి నవ్వసాగింది. తగిలిన దెబ్బల బాధకన్నా సుభద్ర ఎగతాళి మాటలు నా మనస్సును మరింత బాధపెట్టినయ్యి. జరిగినవిషయం సుభద్రకు ఏమని చెప్పేది. అత్తయ్యకు ఎట్లా చెప్పేది. చెప్పినా వాళ్ళు సానుభూతి చూపక పోగా నిజంగా నాలో అలాంటి చెడ్డబుద్ధి ఉన్నదనే అనుకుంటారు. అప్పు పరిస్థితి ఎట్లా ఉంటుందో ఆలోచించు. నేనేం మాట్లాడలేదు. ఏమీ చెప్పలేదు. ఆ పగలంతా మీ బావ నాతో మాట్లాడలేదు" అని నవ్వు ముఖంతో నా వైపు చూసింది అక్కయ్య.

అంత కష్టపడిన విషయాలు చెపుతూ, అంతలోనే నవ్వు ముఖంతో నా వైపు ఎందుకు చూసిందో నాకూ అర్థంకాక నేనూ ఆశ్చర్యంతో అక్కయ్య వైపు చూశాను.

"సీతా, మన హైందవ సాంప్రదాయమే అటువంటిది. పట్టుదలలూ పర్యవసానాలూ ఎట్లావున్నా హిందూ స్త్రీ భర్తతో ఉంటే అన్నీ సమసి పోతయ్యి. ప్రేమ, ఆదరాభిమానాలు ఎంతవున్నా భార్యాభర్తలు విడిగావుంటే సంఘం హర్షించదు. వారిద్దరి మధ్యా ఏవో కలతలున్నయ్యనే నూటికి నూరుమందీ అనుకుంటారు. మన భారతీయ సాంప్రదాయాలు అటువంటివి. గత రాత్రి అంత గ్రంథం జరిగినా, మర్నాడు రాత్రి మళ్లా నేను వారి చెంత చేరవలసిందే. లేకపోతే ఎన్నో రాద్ధాంతాలూ అపోహలూ, సంసారంలో కలతలూ కలుగుతయ్యి. ఆ రాత్రే మళ్లా వారి దగ్గరకు వెళ్లాను. ఇతరులు అపోహ పడకుండా ఉండటానికి [illegible], ఆ పూలు

43వ పేజీ చూడండి

# దశావతారములు!









మత్స్యః కూర్మో వరాహశ్చ। నారసింహశ్చ వామనః। రామో రామశ్చ రామశ్చ। బుద్ధః కలికి రేవచ॥

ఫొటోలు : ఎస్. రామకృష్ణ




## జరిగిన కథ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాథను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికి కూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ల స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మామయ్యకు ఇష్టంలేకపోయినా, మధు స్కూల్లో చేరతాడు. హెడ్ మాస్టరు మధు ప్రతిభను చూసి సంతోషిస్తాడు. విశ్వనాథం మధును సతాయించటాన్ని సుందరమ్మగారు ప్రతిఘటిస్తుంది. అంతేకాదు, మధుపట్ల నానాటికి విశ్వనాథానికి ద్వేషం పెరిగిపోవటం, సుందరమ్మగారికి బాధాకరంగా పరిణమిస్తుంది. తోటలో జరిగిన దొంగతనాలకు మధు బాధ్యుడవుతాడు. ఈవిషయాన్ని తెలిసికొన్న విశ్వనాథం మధును రక్తం కారేటట్లు కొడతాడు. దగ్గరి బంధువైన డాక్టర్ కేశవరావ్ పరిచయం మధులో కొత్త ఉత్సాహాన్ని కల్పిస్తుంది. ఉద్యోగంలో చేరిన సూర్యానికి ఆ ఇంటినుంచి విడిపోవటం తప్పనిసరి అవుతుంది. అనతికాలానికే సూర్యం గృహస్థుడవుతాడు. ఇందిర ఆతనికి తగిన భార్య. మధుకు ఇందిర వాత్సల్యం లభిస్తుంది. పై చదువులకు పట్నం వెళ్లిన మధు సెలవుల్లో ఇంటికి వస్తాడు. అయిష్టంగానే విశ్వనాథాన్ని చూడటానికి వెళ్తాడు. అక్కడ చిన్న ఘర్షణ జరుగుతుంది. పరీక్షలు వ్రాసి ఇంటికి వచ్చిన మధులో ఏదో వెర్రివుందని ఇందిర గ్రహిస్తుంది. కాలేజీలో తను చేయని నేరానికి శిక్షగా, ఒక సంవత్సరం తన పరీక్ష ఆపారన్న వుత్తరాన్ని విశ్వనాథం చించినందుకు మధు కోపోద్దీపితుడై, ఆయన్ని తీవ్రంగా మందలిస్తాడు. జమీందారిణిగారింట్లో వున్న సుశీల పరిస్థితి మెరుగవుతుంది. ఇందిర అన్న భాస్కరానికి, సుశీలకు వివాహం జరుగుతుంది. సుధను మధుకిచ్చి పెళ్లిచేయటానికి విశ్వనాథం నిరాకరించటంతో ఆ రెండు కుటుంబాల మధ్యనున్న అగాథం పెద్దవుతుంది.

# 18

నెల తిరక్కుండానే విశ్వనాథం కూతురికి సంబంధం కుదుర్చుకొచ్చాడు.— "వరుడు రాజశేఖరం బి.ఏ. చదువుతున్నాడు. చీటికీ మాటికి జబ్బుపడి అనారోగ్యాలవల్లగానీ—లేకపోతే బియ్యేగియ్యే ఏనాడో అయిపోయిందనిపించేవాడు. తల్లిదండ్రులకు నలుగురు ఆడపిల్లల తర్వాత ఒక్కగానొక్క కొడుకు. తండ్రి ఆస్తిమీద వ్యవహారాలన్నీ కొడుకే చక్కబెట్టుకుంటాడు.— ఆస్తి దండిగా ఉన్నా ఉద్యోగం చెయ్యాలనే కుతూహలంకూడా అబ్బాయికి దండిగానే వుంది. రాజశేఖరం తండ్రి మేనత్త అల్లుడి అక్కగారి మరిది కాబోలు జిల్లా కలెక్టరుగా పని చేస్తున్నాడు. అతని సిఫార్సువల్ల రాజశేఖరానికి మధుగాడి ఉద్యోగం బాబులాంటిది వస్తుంది. ఇక వరుడు చూట్టానికా? దబ్బపండులా, వంకీల జుట్టూ అదీనూ అచ్చు సినిమా యాక్టర్‌లా ఉంటాడు."— అది ఇంట్లో వాళ్లందరికీ విశ్వనాథం తెలియజేసిన భోగట్టా. తను తెచ్చిన ఫోటోతీసి సుధని పిల్చి—"చూసుకోమ్మా! నీకు ఎంత అందమైన వరుణ్ణి తెచ్చానో ! చూసుకో." అంటూ కవరు అందించాడు. సుధ సిగ్గు సిగ్గుగా సిల్కు ఓణీలో కవరు దాచుకుని గదిలోకి పరిగెత్తింది.— కవరు తెరుస్తుంటే సుధ గుండెలు దడదడా కొట్టుకుంటున్నాయ్— గది తలుపులు బిడాయించి ఎవ్వరు చూడటంలేదని నిర్ధారణ చేసుకుని అరమోడ్పు కన్నులుచేసుకుని ఫోటో తీసింది. హృదయం జల్లుమంది— శరీరమంతా ఆద్యంతం విద్యుత్తు పరుగులెత్తింది. విపరీతమైన సిగ్గుతో ఫోటో మళ్లా మళ్లా చూడలేకపోయింది— "ఎంత అందమైనవాడు ! ఈయనకి మధు బావతో అసలు పోలికేమిటి? పెదనాన్నకి నా మంచిచెడ్డలన్నీ తెలుసు."

సుధకి కాస్త గుండెలు కుదుటబడి ధైర్యం వచ్చింది. తలగడమీద ఫోటోపెట్టి మొహం చుట్టూ దోసిలికట్టి తదేకంగా చూడసాగింది. ఛ ! ఏమిటంత చిలిపిచూపు? పెళ్లిచూపులకే ఫోజు పెట్టినట్టుందే ! అంత అందమైన నొక్కుల జుట్టు దువ్వకోటం ఏమీ చేతకాలా. పాపిడీ గీపిడీ లేకుండా పైపైకి దువ్వేసుకుంటే మొట్లు మొట్లుగా ముచ్చటగా ఉండదూ? ఆ టై కట్టుకోటం ఫాషన్ కాబోలు— ఓ పక్కకి. అవునుమరి బి.ఏ. స్టూడెంటాయే— ఆ షోకులన్నీ తనకేం తెలుస్తాయ్?— సుధ సంతోషానికి అవధులు లేకుండా పోయాయ్.

అల్లుడు మంచి ఆస్తిపరుడన్న సంగతి గుర్తు చేసుకుని పదేపదే ముసిముసిగా నవ్వుకొంది సావిత్రి. సీతాపతికికూడా ఒక రకంగా సంతృప్తి కలగక పోలేదు— "పోనీ మధూ కాకపోయినా ఏదో లక్షణమైందే వచ్చింది సంబంధం. అన్నయ్య మాత్రం సుధకి అన్యాయం చెయ్యగలడా?" అనుకున్నాడు.

"ఐదువేలకే ఇంత మంచి సంబంధం కుదరటం నిజంగా సుధ అదృష్టం. వాళ్లు మంచి ఆస్తిపరులే కాదు. బాగా పలుకుబడి కలవాళ్లుకూడాను. "నాతో వియ్యం పొందటానికి వాళ్లెంతో సంబరపడుతున్నారు." ఈ మాటలు రోజుకి రెండు మూడు సార్లయినా వల్లెవేస్తాడు విశ్వనాథం.

* * *

ఒకసారి వచ్చి వెళ్లమని రాసిన ఇందిర ఉత్తరం చూసుకుని బయల్దేరాడు మధు.

"సుధకి సంబంధం కుదిరిందట. లగ్నంకూడా పెట్టుకున్నారట."

మధు ఆశ్చర్యంగా చూశాడు— "ఇందుకేనా వదినా నన్ను రమ్మని రాశావు."

"నిజంగా నాకు బాధగా ఉంది మధూ. మీ అమ్మమ్మగారు తిండీ నిద్రా లేకుండా కుమిలి పోతున్నారు. నీ కిష్టమైతే మీ అన్నయ్య ఇంకో సారి అడుగుతామంటున్నారు".

"ఎంత అభిమానంలేని వాళ్లు వదినా మీరు !"

"అభిమానాలకేమిటి మధూ? సిగ్గుపడాల్సిందేమీలేదు. మీ అమ్మగారి కోరిక తీరితేగాని బావుండదని మీ అన్నయ్య బాధపడుతున్నారు."

"వదినా ! ఆ నాటి విషయాలన్నీ నాకింకా గుర్తు ఉన్నాయి. మా అమ్మ సుధ చిన్న పాపగా ఉన్నప్పుడు గొలుసు కూడా ఇచ్చింది. చిన్ననాడే మా పెళ్లి నిర్ణయంచేసింది. వాళ్లందరిమీదా ఎంత కోపం— ఎంత అసహ్యం ముంచుకు వచ్చినా మా అమ్మ నిర్ణయానికే ఇన్నాళ్లూ నేను కట్టుబడి ఉన్నాను. కాని.........అలా జరగటంలేదు. దానికి మనం చెయ్యగలిగిందేమీలేదు. ఈ పరిస్థితుల్లో అమ్మేవుంటే మనల్ని క్షమిస్తుందిగానీ శపించదు."

ఇందిర దగ్గరిగావచ్చి మధు చేతిమీద చేయి వేసింది—

[illegible]
నిజంచెప్పు మధూ!”

మధు మాట్లాడలేదు.

“చెప్పు మధూ! మీ అమ్మతో నీ మనస్సు విప్పి చెప్పవూ?” ఇందిర అనునయంగా వాత్సల్య పూరితంగా మధు కళ్ళలోకి చూసింది.

“చెప్పటాని కేముంది వదినా? నాకు వూహ

# కూలిన గోడలు

తెలిసినాటినుంచీ సుధకీ నాకూ ఏదో అనుబంధం ఉందని అర్థం చేసుకున్నాను. ఆ అభిప్రాయాలు ఏనాడూ మారలేదు. ఈ క్షణంవరకు నా మనస్సులో సుధకి చోటువుంది. అంతకుమించి చెప్పటానికేముంది?”

“విశ్వనాధంగారు మొదట మొదట ఆర్భాటం చేసినా ఇంతవరకూ రాటనీ— మీ చిన్నమామయ్య గారు ఒప్పుకోరనీ అనుకున్నాం— కానీ.....”

“చిన్న మామయ్య నిజంగా ఒప్పుకున్నాడా?”

“అదేంటి అలా అడుగుతున్నావు? పిల్లతండ్రి ఒప్పుకోకుండా పెళ్ళి జరుగుతుందా?”

“సుధ?”

ఇందిర ఆశ్చర్యంగా చూసింది— “నీకు నిజంగా మతి చలించింది.”

“కాదు వదినా! చిన్న మామయ్య సంతోషంగా ఒప్పుకోలేదు. అంతవరకూ - నాకు తెలుసు. సుధనికూడా అలాగే బలవంతంగా ఒప్పించారేమో!”

“నువ్వు భ్రమపడుతున్నావు మధూ! సుధకి నీ మీద ఇష్టం ఉన్నాడు అయిష్టంగా మరో సంబంధంధానికి ఒప్పుకోవలసిన అవసరంలేదు.”

“పోనీ వదినా! ఇంత లక్ష్యంలేని పెళ్ళి జరిగినా సుఖం వుండదు. ఇంతమాత్రానికే మనం బాధ పడటమే తెలివి తక్కువ.”

“నువ్వు లోలోపల బాధపడకుండా సమాధానించుకుంటే చాలు, మధూ! అదే నా విచారం.”

“నిజంగా ఒక్కసారి సుధని కలిసి మాట్లాడ దామనుకున్నాను వదినా! ఆలోచిస్తే అది నాకేం నచ్చలేదు. నేను తొందరపడటంవల్ల లోకులు నవ్వటమేగానీ ప్రయోజనం ఉండదు.— చిన్ననాటి మంచీ జరిగిన సంఘటనల్నీ నెమరువేసుకుంటే సుధ నన్ను అభిమానించినట్టు ఎక్కడా అనిపించదు. మొదటినుంచీ నేనంటే అలక్ష్యంగా అయిష్టంగానే ఉండేది. సుధకి నన్ను చేసుకోవాలన్న కోరికే ఉంటే సాహసించలేనంత తెలివి తక్కువదికాదు— అదే ఆలోచించి నా ఉద్దేశ్యం మార్చుకున్నాను. సుధని బలవంతంగా ఒప్పించారేమోనన్నది అబద్ధమేకావచ్చు.”

“మధూ! నీ మీద నాకు సోదర వాత్సల్యం తప్పితే మరేమీకాదు. నిజం చెప్తున్నాను. నీలాంటి వ్యక్తిని పోగొట్టుకుంటున్న సుధ చాలా దురదృష్టవంతురాలు.”

“అలా ఎప్పుడూ అనుకోకూడదు వదినా! సుధ ఎక్కడైనా సుఖంగా ఉంటుంది.”

“అదీ మంచిదేలే.”

మధు మనస్సునెంత సమర్థించుకోజూచినా కొన్నాళ్ళు ఏదో వేదన అనుభవించక తప్పలేదు. సుధని భార్యగా పొందజాలననే కోరిక తనలో అంతగా పాతుకుందనీ సుధ పరాయిదైపోవటం తనకు కష్టాన్ని కల్గింస్తుందనీ అప్పటివరకూ అర్థం కాలేదు మధుకు.

సుధ పెళ్ళి మూడు రోజులు ఉందనగానే మధు వెళ్ళిపోయాడు. ఆ రోజు— సుధ పెళ్ళిరోజు. శుభ ముహూర్తం వేళ— అర్ధరాత్రి ఒంటిగంట ముప్పై నిముషాల సమయంలో దాదాపు తెలివి తప్పిన పిచ్చివాడిలా ఆకాశంలోకి చూస్తూ ఉండిపోయాడు మధు.

బ్యాండు మేళాలతో సన్నాయి పాటలతో పెళ్ళిసందడితో మార్మోగిపోతున్న పెళ్ళిపందిరి అంతా తానొక్కడే అయి నిలిచాడు విశ్వనాధం.

రాజశేఖరం సుధ మెడలో మంగళసూత్రం కడుతున్నవేళ సీతాపతి ఎంత ప్రయత్నించినా

ఆపుకోలేని కన్నీటిని రహస్యంగా నిశ్శబ్దంగా తుడిచేసుకున్నాడు.

*　　*　　*

సుధ అత్తవారింటికి వెళ్ళిపోయింది. మునిమనుమలతో ఆటలాడుతూ కన్ను మూసింది సుందరమ్మగారు.

సుదీర్ఘమైన— బాధాపూరితమైన రెండు సంవత్సరాలు కాల ప్రవాహంలో కొట్టుకుపోయాయి. మధు పెదవులమీది చిరునవ్వు ఎప్పటిలా కాంతిగా మెరవసాగింది. వివేకవంతుడైన మధు పరిస్థితులకు తాను లొంగిపోకుండా నిలబడగలిగాడు—

ఆ సమయంలోనే మధుకి ప్రఖ్యాత రచయిత్రి శారదాదేవితో పరిచయం కలిగింది. ఆమె రచనల లోపాలను విమర్శిస్తూ మధు రాసిన ఉత్తరానికి శారదాదేవి వెంటనే సమాధానం ఇస్తూ రాసింది— "మీరు ఉపార్జించేసుకోకపోతే ఒక మనవి. ఇంత వరకూ నా రచనలను మీలా విమర్శనాత్మకంగా చూసినవారూ వాటిలో లోటుపాట్లను ఎత్తి చూపినవారూ కానరాలేదు. వచ్చినవాళ్ళంతా విధిగా నన్నూ నా రచనాశక్తినీ పొగిడి మరీ వెళ్తూంటారు. మీ పరిచయం నేను చాల గొప్పగా భావిస్తున్నాను. మీతో ముఖతః మాట్లాడటంవల్ల ఇంకా కొన్ని విషయాలు తెలుసుకోగలనని ఆశిస్తున్నాను."

శారదాదేవి లేఖ చదివి మధు మొదట విస్తుపోయాడు. తర్వాత వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు.

శారదను కలుసుకున్న రోజు మధు జీవితంలో అపురూపమైనది.— అపూర్వమైనది !

తన కోరిక మన్నించి తనతో మాట్లాడటానికి వచ్చిన ఆఫీసర్ మధుసూదనరావుని రచయిత్రి శారదాదేవి సాదరంగా ఆహ్వానించింది. ఇంట్లో అంతా శారద అభిమాన పాఠకుణ్ణి గౌరవాభిమానాలతో పలకరించి మర్యాదలుచేశారు.

వారి పరిచయం పరిచయంగానే నిలిచిపోలేదు. నిర్దుష్టమైన వ్యక్తిత్వం— బలియమైన ఆత్మవిశ్వాసం గల మధుసూదన్ శారదాదేవికి ప్రియమైన స్నేహితుడు !

తన స్నేహాన్ని వాంఛిస్తూ తను కోరుకున్న లక్ష్యాలన్నీ పొందుపరుచుకున్న అందాల శారద మధుసూదన్‌కి అపూర్వమైన స్నేహితురాలు ! శారదాదేవి మధుసూదన్ కోసం ఆపేక్షగా నిరీక్షిస్తూ కూర్చుంది.

శారద నిరీక్షణ వ్యర్థంగాకుండా మధుసూదన్ వచ్చాడు. తన ఆలశ్యానికి సంజాయిషీ చెప్పుకున్నాడు. స్నేహితులిద్దరూ మాటల్లో మునిగి వుండగా వారి ముందుగా ఓ యువతి నడచి పోయింది. తెల్లని చీరా ఎర్రని జాకెట్టూతో చాలా మనోహరంగా కన్పించింది.— మంత్రించినట్టే మాటలుమాని మధు ఆ యువతి వెళ్ళిపోయేవరకూ చూశాడు.

సుధకి పెళ్ళయిన తర్వాత మధుచూసింది అప్పుడే !——— అప్పుడు............

కథ ఆగిపోయింది.

*　　*　　*

మధుసూదన్ వాచీ చూసుకున్నాడు. రెండు ముళ్ళూ పన్నెండుమీద సరదాలాడుకొంటున్నాయి. వాచ్ తీసి టేబుల్‌మీదపెట్టి బెడ్డింగుమీద వాలిపోయాడు.

కళానికందని— మాటలకు, చిక్కని విచిత్రానుభూతులకు లోనయ్యాడు మధుసూదన్. ఆగచుకోలేని సంతోషంతో తల మున్కలై ఉక్కిరిబిక్కిరయ్యాడు. ఎంత చిత్రం ! తన జీవితం ఒక నవలగా అందులో తను కథానాయకుడిగా........ఎన్నడూ వూహించనైనా వూహించలేదే !"

శారద— ఆదమరిచి గాఢంగా నిద్రపోతూ ఉంటుంది. రెక్కలుగట్టుకు ఎగిరిపోయి శారద గదిలో ప్రత్యక్షమై హఠాత్తుగా నిద్ర లేపేస్తే..?

తీయని తలపులతోనే ఆ రాత్రి నిద్రపట్టేసింది. మర్నాటి ఉదయం— నీరెండలో నిలబడిన శారద మధుసూదన్‌ని చూస్తూనే నవ్వింది— నెమ్మదిగా తన గదిలోకి దారితీసింది. మంత్రముగ్ధుడై వెంట నడిచాడు మధుసూదన్.

"చదివేశారా? అప్పుడే?" ఆశ్చర్యం వ్యక్తపర్చింది శారద.

"శారదా !" మధుసూదన్ సూటిగా శారద కళ్ళలోకి చూడబోయాడు.

"ఏమిటే?" శారద తల పక్కగా తిప్పుకొంది.

మేష్టారు : ఈ స్కూలు మేష్టరీ ఉద్యోగం దొరికిన తరవాత బొత్తిగా రాత్రిళ్లు నిద్దేపట్టడం లేదు...

మిత్రుడు: మేష్టరీ ఉద్యోగం అంత కష్టమా ఏమిటి?

మే : పగలంతా స్కూల్లోనే నిద్రపట్టేస్తోంది!

కె. రంగారావు (కాకరపర్రు)

"ఆగిపోయారేం? మాటలు రావటంలేదా?"

"లేదు. నిజంగా శారదా ! మాటలు రావటం లేదు."

శారద నవ్వింది. "ఎంత చిత్రం ! మాట్లాడుతూనే మాటలు రావటం లేదంటున్నారు !"

మధుసూదన్‌కూడా నవ్వాడు— "కాదు శారదా ! జీవితాలు కథలుగా మార్చితే ఇంత రమ్యంగా వుంటాయని నాకు తెలీదే !"

"అలాగా ?"

"నిజం. రాత్రి ఎనిమిది గంటలకు పార్శిల్ విప్పేవరకూ ఇది మరేదో నవల అనుకున్నాను. కాని నా గాథ నేనే చదువుకొంటూంటే.....ఎలా చెప్పను శారదా? ఆ అనుభూతులు నేను వర్ణించలేను.. సర్వం మర్చిపోయి మరచిపోయాను. నా కథలో లీనమై చిన్ననాటి మధుగా మారిపోయాను. ఆ రోజులు ఆ ఘట్టాలు అన్నీ మరొక్కసారి అనుభవించాను. తదేకంగా చదివి ముగించేసరికి పన్నెండు దాటింది. అప్పటికప్పుడే వచ్చి ఇదంతా నీకు చెప్పెయ్యాలని ఆరాటపడిపోయాను— నిన్ను హృదయపూర్వకమైన అభినందనలతో, కృతజ్ఞతలతో ముంచెత్తాలని తహతహలాడిపోయాను. నమ్ము శారదా !"

శారద క్షణం ఆశ్చర్యంగా చూసింది— "నమ్ముతున్నాను. మీలో విచిత్రమైన మార్పు వచ్చింది."

"నాలోనా? ఏమిటి?"

శారద చిరునవ్వు నవ్వుతూ అంది— "నన్ను ఏకవచనంలో సంబోధించి మాట్లాడుతున్నారు మీకు తెలుస్తోందా?"

మధుసూదన్ తత్తరపడ్డాడు.

"నన్ను మన్నించి పిలవద్దని మిమ్మల్ని ఎన్నో సార్లు కోరాను. మీరు లక్ష్యపెట్టలేదు సరిగదా— "మన మధ్య అంత చనువుగా పిల్చుకోనటానికి అనుబంధ మేమిటి శారదా ?" అని అడిగారు ఇప్పుడు మీకై మీరే పిలుస్తున్నారు. ఆ అనుబంధమేదో ఏర్పడిందనే మీ ఉద్దేశ్యమా ?"

"క్షమించు శారదా ! అలా పిలుస్తున్నానని కూడా నాకు తెలీలేదు."

శారద మధుసూదన్ కళ్ళలోకి చూసింది—

"మధూ ! అలా పిలిపించుకోవాలనే కదా నా కోరిక ? నన్ను మీరు సన్నిహితంగా భావిస్తున్నారని —అందుకే మీ మనస్సు ఇంతగా మారిపోయిందని అనుకొంటున్నాను. అవునా ?"

మధు మాట్లాడకుండా మౌనం వహించాడు.

"ఏవో అభినందనలూ, కృతజ్ఞతలూ అందజేస్తామన్నారే ! అవేవీ నా కవసరంలేదు."

"మరి ?"

శారద మరుగ్గా చూసింది—"నేను అడగాలనుకున్నా. మీకున్నపాటి అభిమానం, వ్యక్తిత్వం నాకూ ఉన్నాయి. సరే ! ఆ విషయం వదిలెయ్యండి. అసలు విషయం మాట్లాడుదాం."

"శారదా ? నీకు కోపం వచ్చిందికదూ ?"

"ఎవరిమీద ?"

"నామీదే. నామీదేగా కథంతా రాశావ్. నీకు నేను ఎంతైనా ఋణపడి ఉన్నాను శారదా! నా జీవితాన్ని కథగా రాసిన నీ శ్రమ అమూల్యమైనది."

శారద నిర్లక్ష్య భావం వ్యక్తపరుస్తూ అంది— "అదేమిటి ? నాకేదో దొరికింది. బావుందనిపించి రాసుకున్నాను. మధ్య మిమ్మల్నేదో అందలం ఎక్కించినట్లు అభినందిస్తారేం ?"

మధుసూదన్ షాక్ తిన్నట్టు చూశాడు. మరు నిముషంలో తేరుకొని నవ్వుతూ అన్నాడు— "అలాగా తమరు రచయిత్రి నంటూ బయల్దేరి కనబడ్డ వాళ్ళ జీవిత చరిత్రలన్నీ కాయితాలమీది కెక్కిస్తే ఫలిత మేమిటో తెలుసా ? మా కుటుంబ రహస్యాలన్నీ బట్టబయలు చేశారని నేను మీమీద కేస పెడితే .... ?"

"ఉఫ్ మని వూదేస్తాను— విశ్వనాథంగారు ఎప్పుడూ మీకు వ్యతిరేకం. మీ యిద్దరిమధ్యా వచ్చి కట్టెలు వేసినా భగ్గుమంటాయి. ఒకరు అవునన్నది మరొకరు కాదనటమే మీ ధ్యేయం. ఈ కిటుకు నాకు తెలియకపోతే కదా ?" శారద నవ్వుతోంటే మధుసూదన్ అడ్డుపడ్డాడు—

"అయితే మాత్రం .... ?"

"అయితే లేదు గియితే లేదు. కేసంటూ వస్తే మనం ఇద్దరం వెళ్ళి కోర్టులో కూర్చుందాం. ఇదంతా మీరే నాకు చెప్పి రాయించారని చెప్పలేనా ఏమిటి ?"

"హాయింటే !" మధు అంగీకరించాడా?

శారద మధుసూదన్ కళ్లలోకి మృదువుగా చూసింది—"మరి ఈ నవలకు ముగింపు ?"

శారద కంటి చూపులతో మధూ మనస్సంతా నిండిపోయింది. పొంగు లెత్తుతూన్న ఆవేశం బల వంతాన అణుచుకుని అమాయకత ఉట్టిపడేలా అన్నాడు. "రచయిత్రివి నువ్వు—నీ నవలకు ముగింపు నే నెలా చెప్పను ?"

"రాసింది నేనే అయినా కథానాయకులు మీరు. అందుకే మిమ్మల్ని అడిగాను."—శారద మౌనంగా కూర్చుంది.

"ముగింపు ఆలోచిస్తున్నావా శారదా ?"

"నా ఆలోచన ఎప్పుడో ముగిసిపోయింది.—ముగింపు మీరు చెప్పనినాడు నవల అసంపూర్తిగా వదిలేస్తాను." శారద కొంతసేపు ఆగి నెమ్మదిగా అంది—"మధూ ఏమిటో నా కిప్పుడు పూర్తిగా తెలుసు. ఆ పాత్రని నే నెంతో అభిమానిస్తాను. అందుకే నేను సాహసించి ఏ ముగింపూ చెయ్యలేక పోయాను."

మధుసూదన్ నవ్వాడు మధురంగా— మృదువుగా—

"చాలా చిత్రంగా మాట్లాడుతున్నావు శారదా! నీకు కోపం కూడా వచ్చినట్టుంది. సరే, కొన్నాళ్లు నాకు టైమిస్తే— ఆలోచించి నీకు నచ్చే ముగింపు చెప్తాను. ఇంత పెద్ద బాధ్యత నామీద పెడుతున్నావంటే ఎంత శ్రద్ధగా ఆలోచించాలి నేను ! అవునా ?"

శారద నవ్వింది చిన్నగా.

* * *

ఆ రాత్రే మధు ఇంటికి—ఇందిరకు ఉత్తరం రాశాడు—"ఈ విషయం ఎప్పుడో నీకు రాయా లనుకున్నాను వదినా ! ఎప్పటికప్పుడు వెనకాడుతూ వచ్చాను. కారణం నేనే ఒక నిర్ణయమంటూ చేసుకోలే దింతకాలం.

"శారద గురించి అంతా చదివావుకదూ? నీ ఉద్దేశ్యము అన్నయ్య ఉద్దేశ్యమూ తెలుసుకోకుండా నేను మాట ఇవ్వలేకపోయాను. వెంటనే ….. "

ఆ ఉత్తరానికి ఇందిర పెద్ద జవాబే రాసింది—

"నువ్విటువంటి స్వయంవరమేదో తెచ్చి పెట్ట లేదేమా అనే ఇంతకాలం ఆలోచిస్తున్నాను. నా ఆలోచన తల్లక్రిందులుగానందుకు చాలా సంతోషం.

"మధూ! ప్రేమాభిమానాలతో నువ్వు మా అనుమతి కోరావేగానీ నీ భవిష్యత్తు నిర్ణయించుకొనే హక్కూ శక్తీ నీకే ఉన్నాయి. విషయాన్ని నువ్వు స్వతంత్రంగా ఆలోచించుకోగలవు. మంచి చెడ్డలు నిర్ణయించుకోగలవు. అతి సున్నితమైన నీ మనసు నాకు తెలుసు.

"కాని మధూ ! జీవితనావకు చుక్కానివంటి సహచరిని ఎన్నుకునే ఈ తరుణంలో నీకు నేను తల్లిగా — సోదరిగా — గురుతరమైన బాధ్యతతో ఈ చిన్ని సలహా యిస్తున్నాను. శారదాదేవి ఒక ప్రఖ్యాత రచయిత్రి అనే ఆశతో గానీ—ఆమె నీ కథ రాసిందనే అభిమానంతోగానీ ఆమెని పెళ్లి చేసుకోవటానికి నిర్ణయించుకోవద్దు. ఆమెలో నువ్వు చూసిన రచనాశక్తి ఏనాటికైనా మరుగుపడిపోతే నీకు అసంతృప్తే మిగులుతుంది. నీ అంతరాత్మను నువ్వే శోధించి, విమర్శించి తెలుసుకో. ఆమెలో సహజమైన స్త్రీత్వం చూడగలిగితే—ఆమె నీక. అన్నివిధాలా నచ్చితే వేరే మా అభ్యంతరమేమీ లేదు నీ సంతోషమే మా సంతోషమని చెప్పమన్నారు మీ అన్నగారు— ఒక్కటి జ్ఞాపకం ఉంచుకో—నీకు గానీ ఆమెకుగానీ ఈ దశ చాల ఆవేశపూరితమైనది. ఈనాటి నిర్ణయాలు ఒకనాటికి పశ్చాత్తాప కారణాలు మాత్రం కాకూడదుసుమా ! మీ ఇరువురికీ మా ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి."

మధుసూదన్ తృప్తిగా నవ్వుకున్నాడు. వదిన తను ఆశించిన విధంగానే రాసింది. అటుతర్వాత ఉత్తరంలో ……

"మీ మేనమామలగారి కుటుంబ పరిస్థితులు దారుణంగా మారాయంటే అతిశయోక్తి కాదు. ఈ విషయాలన్నీ నేను ఆనోటా ఈనోటా విన్నవి మాత్రం కావు. అలా అమ్మలక్కల కబుర్లు రాస్తే

## భారీ యెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

# కూలిన గోడలు

నువ్వు నమ్మవని నాకు తెలుసు. సుధ నాకు స్వయంగా చెప్పింది. నీకు ఆశ్చర్యంగా ఉంది కదూ ? మొన్న పక్కవారింటికి పేరంటానికి వస్తే సుధని నేనే మన ఇంటికి రమ్మన్నాను. పిలవగానే వచ్చింది. మనిషి చాలా మారిపోయినట్లూ దేనికో లోలోన బాధపడుతూన్నట్లూ కన్పించింది.

"సుధ కాపురం మూన్నాళ్ల ముచ్చటగా చేసుకుని పుట్టింటికి వచ్చేసింది. రాజశేఖరం ప్రవర్తన బొత్తిగా మంచిది కాదట. మీ పెదమామయ్యగారు అల్లుడితో ఘర్షణపడి కూతుర్ని తీసుకు వచ్చేశారు. ఇక ఇన్నాళ్లూ తమ్ముడి పిల్లలకే ఆస్తి ఇచ్చేస్తామన్న మీ పెద్ద మామయ్య వదినగారి కొడుకు సత్యన్నారాయణని ఈమధ్యనే యిక్కడికి కాపురం తీసుకు వచ్చేశారు. సత్యన్నారాయణకి రెండు సంవత్సరాల క్రిందటే పెళ్ళయింది. ఓ కొడుకు కూడాను. తమ ఆస్థి అక్కగారి కొడుకుకే ఇవ్వాలని మీ పెద్దత్త పట్టు. మీ మామయ్య కూడా ఒప్పుకున్నారట. దానితో తోటికోడళ్లిద్దరికీ కలతలొచ్చి వేర్లు పడిపోయారు—ఇక కృష్ణయ్య అల్లరిచిల్లరిగా తిరుగుతూ ఇంటిపట్టే పట్టటం లేదు—ఈమధ్య ఒక నెల్లాళ్లుగా ఊళ్లోనేలేడు.

"ఇవన్నీ సుధవల్లే తెలుసుకున్నాను. మధ్య మధ్య అభిమానపడుతూన్నట్టు కన్పించినా అన్నీ చెప్పింది. ఇంతకన్నా ఎక్కువేమీ నాకు తెలీదు. ఇవన్నీ వినగానే నీకు రాయాలనిపించింది— ముఖ్యంగా సుధ కాపురం పాడైనందుకు నీ అన్నయ్య చాలా బాధ పడుతున్నారు."

నమ్మలేని విషయాలు విన్నట్టు విభ్రాంతితో కొయ్యబారిపోయాడు మధు.

సుధ కాపురం పాడుచేసుకుని పుట్టింటికి వచ్చేసిందా ? తెలివితేటలుగల సుధ భర్తలో లోపాలు ఆమాత్రం సరిదిద్దుకోలేక పోయిందా ?

పెద్దమామయ్య—దుర్మార్గుడు ! నమ్మించి ఎంత మోసం చేశాడు ! ఆస్తి యిస్తానని ఇన్నాళ్లూ మభ్యపెట్టి ఇప్పుడిలా చేస్తే .... ఛీ ! ఎంత సిగ్గులేకపోయింది !

పాపం చిన్నమామయ్య ఎంత బాధపడుతున్నాడో ! ఎంత కుమిలిపోతున్నాడో ! చదువుసంధ్యలు లేని కొడుకు ! కాపురం పాడుచేసుకున్న కూతురు ! నమ్మించి ద్రోహంచేసిన అన్నగారు. పెంచి పెద్ద చెయ్యాల్సిన పసిబిడ్డలు .... అయ్యో ! ఆదుకునే వాళ్లెవరు ?

మధు చాలసేపు కాలుగాలిన పిల్లిలా గదంతా కలతిరిగాడు— పోనీ ఒక్కసారి వెళ్లి వస్తే ....? సీతాపతి మామయ్యకి కొంచెం ధైర్యమన్నా చెప్తే ? మరి ఆ గదిలో ఒక్క క్షణం నిలబడలేకపోయాడు. గబగబా బెడ్డింగ్ సర్దుకొని గదికి తాళంపెట్టి శారదకు నాలుగు ముక్కలు గీసిన కార్డు దారిలో పోస్టుచేసి తిన్నగా రైలుస్టేషన్‌కి బయల్దేరాడు.

* * *

"నేను చేయగలిగిందేమీ లేదని తెలుసు వదినా! అయినా నీ ఉత్తరం చదివి అక్కడ మరి ఉండలేకపోయాను. ఏమిటో నాకు చాల బాధగా ఉంది" అన్నాడు దిగులుగా మధుసూదన్.

"అవును. ఇది రక్తసంబంధం. పైకి తెలీని అభిమానాలు అంతరంగంలో దాగి ఉంటాయి. కావలసిన వాళ్లకు కష్టం వస్తే మనకు వచ్చినట్టే కదా ?"

"ఎందుకో నాకు సుధ అంటే చానాళ్లా యిష్టం వదినా ! తాను ఎన్నడూ చేరనివ్వకపోయినా నేను మాత్రం సుధ మీద కోపం పెట్టుకోలేదు. పోనీ సుధ యిష్టమైన వ్యక్తిని పెళ్లిచేసుకుని సంతోషంగా ఉందికదా అని నా దిగులు మర్చిపోయాను. కాని .... దాని బ్రతుకిలా పాడుకావటానికి నేనూ కారణమేనేమో ననిపిస్తోంది. యిప్పుడు."

"అదేమిటి ? చిత్రంగా మాట్లాడుతున్నావ్."

"కాదు వదినా ! సుధ పెళ్లికి ముందు చిన్న మామయ్య నన్ను వచ్చి వాళ్ల అన్నని అడగమని బతిమిలాడాడు. నేను మాత్రం అలా చెయ్యనన్నాను."

"మంచిపని చేశావు. ఇందులో నువ్వు చేసిన పొరపాటేముందని నిన్ను నువ్వు విమర్శించుకుంటున్నావు ? తన వ్యక్తిత్వం చంపుకుని ఇతరులకోసం త్యాగం చెయ్యటమేనా మనిషి కర్తవ్యం ? ఎప్పుడూ కాదు— సుధకీ నీకూ పెళ్లి జరగలేదు గానీ జరిగితే ఆ పరిస్థితి ఇంకెలా మారేదో మనం తెలుసుకోగలమా ? నువ్వంటే అభిమానంగానీ, లక్ష్యంగానీ లేని సుధ నిన్ను చులకన చెయ్యకూడదా? లేకపోతే ఆ కుటుంబంమీద పెంచుకున్న కసి సమయం వచ్చినప్పుడల్లా నువ్వు సుధమీద తీర్చుకోకూడదా ?— అప్పుడు మీ యిదర్ది బతుకులూ సుఖశాంతులకు దూరమై నాశనమై పోయేవికదా? జరగనిదానిలో ఏదో గొప్ప ఉంటుందనుకుని భ్రమ పడతాం మధూ ! అంతే !"

మధు ఆశ్చర్యంగా ఇందిర మొహంలోకి చూడసాగాడు— ఇందిర అంది— "సుధ మాత్రం చాలా మారింది. పూర్వపు అతిశయంలేదు మనిషిలో." చర్వితచర్వణంగా మళ్లా విషయాలన్నీ చెప్పింది. ప్రస్తావన మార్చటాని కన్నట్టుగా శారద విషయం ఎత్తింది— "అయితే శారదకి నీ అభిప్రాయం చెప్పేశావా ?"

"నీ ఉత్తరం చూడగానే వచ్చేశాను కదా ? వాళ్లింటికి వెళ్లనేలేదు."

"నీ ఉత్తరం చూసి మొదట నేను నమ్మలేకపోయాను మధూ ! శారదాదేవి కథలూ, వ్యాసాలూ నేను చాలా చదివాను. నాకు నచ్చుతాయి కూడా. ఇంత గమ్మత్తుగా ఆవిడ నా తోటికోడలు కావటం... నమ్మలేకపోయా ననుకో. మీ అమ్మమ్మగారు ఉంటే ఎంత సంతోషించేవారో మధూ ! పాపం నీ పెళ్లి చూడాలని కలవరించిపోయారు కదా ?"

"అమ్మమ్మ ఉంటే అది అనుభవించే సంతోషం కన్నా విచారమే ఎక్కువ వదినా ! లేకపోవటమే మంచిదయింది."

మధు మనస్సు బాగాలేదని యిందిర లేచి లోపలికి వెళ్లిపోయింది. (సశేషం)

## వచ్చే వారమే!

# వినాయకచవితి ప్రత్యేక హాస్యసంచిక!




అతను దడదడమని ముందు వెళుతున్నాడు, తన వెంబడి ఎవరూ రావటంలేదన్నట్టు. ఆమె చూడ బోతే పొట్టి తింగణా. అతని భుజాలదాకా వస్తుంది. పైగా అతనేమో దడదడమని నడు స్తున్నాడు. అందువల్ల అతనితో సమానంగా నడవాలంటే ఆమె ప్రాణాలు పోతున్నై. ఆమెకు తను తప్పిపోతుందేమోనసే అనుమానంగా ఉంది. అతను అలా ముందుకు వెళ్ళిపోతే మరి! ఈ పాడు బొంబాయిలో తను తప్పిపోతుంది.

అంటే ఆమె ఎక్కువ భయపడిందని కాదు. బొంబాయిలో తప్పిపోతే ఏంచేయాలో ఆమెకు తెలీని సంగతేమీ కాదు. సరాసరి పోలీసు దగ్గర కెళ్ళి, "నేను దోవ తప్పాను. మా యింటికి జేర్చండి" అని చెబితే చాలు. ఆయన ముందు అలా చరచరా నడిచిపోతున్నాడు ఆమెను దోవలో వదిలి పెట్టి పోతాడని కాదు. భార్యను ఏ భర్తయినా దోవలో వదిలి వెళ్ళిపోతాడా ?

కాని ఆమెకూ ఖాతరు ఉన్నట్టు లేదు. అంతా కొత్తగా ఉండటంవల్ల అలా ఉన్నది. ప్రాణం పోతున్నా ఆమె అతన్ని తన దృష్టినుంచి దాటిపో నివ్వదు.

ఈ పరుగు పందెంలో కూడా ఆమె నాలుగు వైపులా, ఉత్తేజకరమైన ఉత్సాహంతో చూస్తూనే ఉన్నది. బొంబాయిలో ఉన్న పేరుమోసిన ప్రదేశా లన్నీ చకచకా చూసేస్తున్నది. చూసినవాటిని చూసి నట్లుగా, ఉప్పు కారం కలిపి, పుట్టింటికి తిరిగి వెళ్ళగానే చెప్పే ఆలోచనలు చేస్తున్నది. ఆమె

మనస్సులో ఏదో భాగంలో, తను కొద్దిరోజులకి అత్తవారింటికి వచ్చినట్లూ, తిరిగి పుట్టింటికే వెళ్లి ఉంటుందనే వూహ ఉన్నది. నాకా దగ్గర కొచ్చేటప్పటికి అతను ఆగిపోయాడు. ఆమె వెనుక పరుగెత్తి అతన్ని కలుసుకుని అతని పక్కన నిల్చున్నది. కాస్త అలా గాలి పీల్చుకునే అవకాశం దొరకగానే, ఆమె కుచ్చెళ్లు సరిచేసుకున్నది. జుట్టు సరిగా ఉందో లేదో, చేత్తో తడిమి చూసుకున్నది. ఇక చెమట తుడుచుకుంటూ, అతనివంక అపేక్షగా చూస్తూ ఉండిపోయింది.

అతను బాగా పొడుగు. ఇరవై నాలుగు ఇరవై ఐదు సంవత్సరాల వయసే అయినా అతని శరీరం లావుదేలి ఉంటుంది. అలా అని శరీరంలో ఎక్కువ మాంసమూ లేదు. చాలని చర్మాన్ని, ఎలాగో అలాగు అతని భారీ శరీరానికి తొడిగినట్లనిపిస్తుంది. ముఖం గంభీరంగానూ, కోపంగానూ, ప్రపంచపు జబాబుదారీ అంతా అతనిమీద పడ్డట్టు ఉంటుంది.

ఇంకెవరైనా అయితే అతనితో మాట్లాడటానికే భయపడేవాళ్లు. కాని, అతనేమీ అనక పోవటం చూచి ఆమే అన్నది. "ఇక రోడ్డు దాటి అటుపక్క కెళదామా మనం—ఏం?" అనవసరంగా అతను ఆమెతో మాట్లాడేటట్లు లేదు. ఆమెవంక కోపంగా నిశితంగా చూశాడంతే. అతని ఆ చూపుకు, ఆమె తన దృష్టి నేలవైపుకు మార్చుకున్నది. ఆజ్ఞ శిరసావహిస్తున్నట్లు అతని ప్రక్కన నిశబ్దంగా నిల్చుండిపోయింది.

ఆమెకూ పదిహేడు, పద్దెనిమిదేళ్లుంటై. కొంచెం పొట్టిగానూ, బొద్దుగానూ ఉంటుంది. రూపంలో గొప్ప అందగత్తె కాదు. కాని, పసిమి రంగులోనూ, నాజూకుగానూ ఉంటుంది. ముఖంలో స్వచ్ఛమైన ఆనందమూ, ఉత్సాహమూ నిండిన మెరుపు. ఆమె కళ్లలో నాట్యమాడే కుతూహలం తాలూకు రెండు గుర్తులున్నై. ఇంకొకళ్ల కెవరికైనా అనిపిస్తుంది. ఆ పిల్లి రెక్క పట్టుకుని ఆడించి—ఆమె చెంపమీద ఒక దెబ్బ కొట్టాలని. కాని ఆమె ఉత్సాహాన్నీ, ఉల్లాసాన్నీ చూచిన నకిలీ— కోపమే—అతనికి వచ్చింది. జీవితంలో డక్కా మొక్కీలు తిని అతను అలా కోపిష్టి అయినాడు, చిరచిర్పుడుగా మారిపోయాడు. ఆమె తన సంతోషంలో గంతులేస్తున్నది. ఈ పిచ్చిచేష్ట—అతను సహించలేకపోయాడు. ఆమెను సరిచేయా లనిపించింది.

అతను కోపంతో ఆమెవంక చూస్తున్నాడు. ఆజ్ఞ శిరసావహిస్తున్నట్లు అతని పక్కనే నిశబ్దంగా నిల్చుని ఉన్నది. కాని ఆమె కళ్లల్లో కుతూహలం తాలూకు గుర్తులు మటుకు నాట్యం చేస్తున్నై.

టాక్సీ డ్రైవరూ, టాంగావాలాలు పోట్లాడుకుంటుంటే ఆమె కుతూహలంతో చూస్తూ ఉన్నది. సంకెళ్లు వేసిన ఖైదీ, అతన్ని తీసుకు వెళుతున్న పోలీసూ, స్నేహంగా మాట్లాడుకుంటుంటే ఆమెకు ఆశ్చర్య మనిపించింది. బిగ్గరగా అరుస్తూ, చకచకా నాలుగువైపులా చూస్తూ ఒక వ్యక్తి—మూడు ముక్క లాటకు ముక్కలు పంచుతున్నాడు. అందులో ఇస్పేటాసేదో, ఆమె మనసులో మనసులోనే వూహించుకోగలదు. అక్కడ నిల్చునే ఆమె తనను సంతోష పెట్టుకోగలుగుతున్నది. అలా ఒకేచోట నిల్చోవటంలో ఆమెకు కష్టం కలగటంలేదు.

అతనికి మటుకు తమ జోడా అలా నాకా దగ్గర నుల్చోవటం నచ్చలేదు. అందుకని ఎక్కువ కోపగించుకుని "సరే! ఇక ఎక్కడికి వెళ్దాం ?—" అన్నాడు.

"నాకేం తెలుసు. మీ రెక్కడికంటే—అక్కడికే" తలతిప్పి అని, మళ్లీ రోడ్డుమీది తమాషా చూస్తూ ఉండిపోయింది. తన యిష్టం ప్రకారం అనటానికి ఆమె తయారైంది—అందువల్ల తన యిష్టానికి వ్యతిరేకంగా ఏదో జరుగుతుందని అనిపించటం లేదు. ఆమె సర్దుకుపోయే తత్వం చూచి అతనికి కోపం మళ్లీ ఎక్కువైంది. "ఇటు చూడు. నేను బొంబాయంతా చూసేశాను. నీకేది చూడాలనుందో చెప్పు—"

"ఏదైనా సరే—" ఆమె మళ్లీ తల తిప్పింది.

"అలా అంటే కుదరదు. ఏదో ఒకటి చెప్పు—' విరుపుగా అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. కొద్దిసేపు అతనూ కోపంతో నిశ్శబ్దంగానే ఉండిపోయాడు. అసహాయత్వంలో అతనప్పుడున్నాడు "మలబార్‌హిల్స్ వెళ్దామా? ఎగ్జిబిషన్ చూడటానికి?"

"ఎగ్జిబిషన్?"

"అంటే ప్రదర్శన. ఈ మాత్రంకూడా తెలీదా?" అతనికి కోపగించుకోవటానికింకొక విషయం దొరికింది. అతనికి బాగా ఇంగ్లీషు మాట్లాడేది, లిప్‌స్టిక్ రాసుకునేది, చేతులులేని బ్లౌజు తొడుక్కునే భార్య యిష్టం. కాని పెళ్లి బజారులో అమ్మా నాన్న అతనికి సగం చదువుకున్న, ఆ అలు మటుకే దిద్దిన పిల్లను కట్టారు.

తను మటుకు నోటితో ఎప్పుడు అక్కర లేదన్నాడు గనుక? తమ బిల్డింగులో ఉన్నవాళ్లకీ, నాన్నకూ అన్నయ్యకూ ఎలా నచ్చివుంటుంది ? చేదుగా అతనామె వంకచూస్తూ ఉండిపోయాడు. కాని ఆమెకు చూపు అతని ఇష్టతమీద లేదు. ఆమె కళ్లు పెద్దవిచేసి అన్నది: "అంటే మొన్న దూరంనుంచి చూపించారే— పెద్ద చక్రముందీ— అదా?"

ఆ పెద్ద చక్రము ఆకర్షించింది. అందులో కూర్చుని పైకి వెళ్లాలని ఉత్సుకతతో ఉన్నది. పైకి వెళితే ఆమెకు భయం కలిగేదేమో— ఆమె పెద్ద కేకలు పెట్టేదేమో.

"చూడు, ఆ చక్రంమీద, ఉయ్యాలలో కూర్చోవలెననే వూహ పెట్టుకోవద్దు, పది రూపాయలు వదిలిపోతై. తేప తేసకూ— ఇంత డబ్బు ఖర్చు పెట్టడం మనకు కుదరదు." తనకు ఎక్కువ డబ్బు దొరకదనీ, అందులో ఎక్కువ ఇంట్లో ఇవ్వాల్సి వస్తుందనీ, అతను కటువైపోయాడు. ఒక విధంగా ఉద్విగ్నమైన వైరాగ్యం అతను ధరించాడు. తనలో ఏ అగ్ని రగులుతున్నదో, అది ఆమెలో రగల్చాలనే కోరిక అతని మనసులో కదులుతున్నది.

ఆమె ముఖం ఒకసారి కొంచెం పైకెత్తించి ఆమెను ఒక్కోసారి ఆ చక్రంలో కూర్చోవాలని ఉన్నది. అంతకన్నా పెద్ద కోరికలేసి లేవు ఆమెకు. దీనికి పది రూపాయలు వృధా ఖర్చు.

కాని చాలాసేపు ఆమె తన మనసు ఉదాసీనంగా ఉండనియ్యలేదు. కోరికలను చంపుకుని ఉన్న దాంతోనే సంతోషంగా ఉండటం ఆమె అలవాటు. ఆమె తండ్రి పోస్టాఫీసులో గుమాస్తా. ఆమెకింకా ఐదుగురు సోదరులు, సోదరీలు ఉన్నారు. ఇట్లే అందరికీ ఆ సంయమం ఉన్నది.

వికసించిన ముఖంతో ఆమె అన్నది. "కాని మనం చక్రం ఎక్కవద్దు— వూరికే చూద్దాం—"

ఆ చక్రం ఎంతపెద్దదో—అందులో ఉన్న ఒక్కొక తొట్టె, తిరగటం ఆమె కళ్లముందు నిల్చినట్లుయుంది. ఆ కల్పనలోనే ఆమె ఆనందం అనుభవించ సాగింది.

"పద—బస్ క్యూలో నిల్చుందాం" అతను విసుగుదలతో అన్నాడు. వాళ్లిద్దరూ వెళ్లి క్యూలో నిల్చున్నారు.

ఒకదాని వెంబడి ఇంకొకటిగా బస్సులు వస్తున్నాయ్— నిండిపోయి. ఒకళ్లిద్దర్నో ఎక్కించుకుని టుణ్ టుణ్ మని గంట మోగిస్తూ అవి వెళ్లిపోతున్నాయ్. ప్రతిసారీ అడుగు అడుగూ చొప్పున ముందుకుపోతూ వాళ్లిద్దరూ అలా నిటారుగానే క్యూలో నిల్చునే ఉన్నారు.

ఆమెకదేమీ అనిపించలేదు. అలా గంటల తరబడి నిటారుగా ఉండటం వాళ్ల కలవాటే. రోడ్డుమీద ఆమెకు తమాషాలు కనిపిస్తున్నాయి. ఆమె తనకు తోచిన విధంగా అర్థం చెప్పుకుంటున్నది. మధ్య మధ్య ఏదో ఒక ప్రశ్న అతన్ని అడుగుతూ ఉన్నది. అతని దగ్గరనుంచి సమాధానం వస్తుందని కాదు. తనకు తమాషాగా తోచినట్లే అతనికీ తమాషే అనిపించి ఉంటుందనే ఉద్దేశ్యంతో.

"అదుగో అతను చేతులో ఏమిటి తీసుకెళుతున్నాడు" ఆమె అడిగింది.

"ఎక్కడ?" అతను విసుగుతో అన్నాడు.

"అదుగో— అక్కడ— ఆ పొడుగు జుట్టూ" ఆమె తలతో కళ్లతో సౌంజ్ఞచేసి చూపించసాగింది.

"ఎక్కడ? సరిగా చూపించు?" చిటపటలాడుతూ అతను విరుపుగా అన్నాడు. బస్సుకోసం నిల్చుని నిల్చుని అతని మనస్సుకూ శరీరానికీ బాధగా ఉన్నది. తనకి జగతిలో గడ్డిపూచ విలువైనా లేదనే భావం అతనికి కలుగసాగింది. అందుకని వూరికే అటూ ఇటూ చూస్తూ ఉండిపోయాడు.

"అదుగో ఆ అబ్బాయేమిటి ఆ ప్రక్కన పోతున్నాడే— అలా చేస్తున్నాడు?" ఆమె బిగ్గరగా నవ్వటం మొదలుపెట్టింది. ఆమె దృష్టికి ఆటగా ఉన్నది.

అతను ఎగురుతూ వెళుతూంటే ఆమె కోలాహలం ఆమెకు గమ్మత్తుగా తోచసాగింది.

"తెలివి తక్కువగా ఏదిబడితే అది వాగకు" అతను బిగ్గరగా అరిచాడు. ఎంత బిగ్గరగా కోప్పడ్డాడంటే, తక్కిన మనుషులు వీళ్లవంక ఆశ్చర్యంతో చూచారు.

ఆమె భయపడి ఒక్కసారి నిశ్శబ్దమైపోయింది. ఆశ్చర్యపడి అతనివంక చూచిందిగాని— ఇంత కోప్పడటానికి కల కారణం ఆమెకు తెలీలేదు. పరాయి వాడి మాదిరిగా అతనికెందుకు వూరికే కోపం వస్తుందో కోప్పడటం తప్ప ఇంకో విషయమేమీ అతనికెందుకు తోచదో ఆమె విడగీయలేక పోయింది. ఆమె కొంచెం కష్ట పెట్టుకున్నది.

కాని అతనలా కోపగించుకునీ, తానిలా కష్ట పెట్టుకునీ ఉండటం ఆమె చమత్కారమనిపించింది.

# చెలిమి

ఆమె పుట్టింట్లో పద్ధతి ఇది కాదు. ఎవరైనా ముడుచు కూర్చుంటే అందరూ ఏగడిస్తారు. ఏడిపిస్తారు. వాళ్ళని నవ్వించేదాకా వదలరు. ఆమె కనిపించింది. అతన్నికూడా అలాగే చేయాలని నవ్వించాలని ఆమె కనిపించింది. కాని ఇంకా అంత చనువు ఏర్పడలేదు. అంత సాన్నిహిత్యం ఏర్పడలేదు. అందువల్ల ఏం చేయాలో, ఏ మనాలో ఆమెకు తోచలేదు. అందుకని ఆమెకు మరీ కష్టమనిపించింది.

అందరూ తనువంక చూడగానే— ఆమెకు ఏమిటో అనిపించింది. తనవల్లేదో తప్పు జరిగి ఉండాలనిపించింది. అతను ఆమెవంక చూచాడు. పొట్టిగానూ, మున్నితంగానూ, ఉన్న ఈ పిల్ల తన ప్రక్కన నుల్చుని నేలచూపులు చూస్తున్నది. తన సహోయురాలులాగా కనిపిస్తున్నది. అతని కనిపించింది ఏడుపు లంకించుకుంటుందేమోనని. అలాగే గనుక అయితే ద్రోవంతా బాగానే ఉంటుంది.

ఇంకొకళ్ళని ఎలా సమాధానపరచాలో అతనికి తెలీదు. "టాక్సీలో పోదామా?" ఇరుకులో పడ్డట్టు అన్నాడతను. "ఎందుకు— వూరికే" ఆశ్చర్యంలో ఆమె అతనివంక చూస్తూ అన్నది.

"వద్దా? నిల్చుని నిల్చుని కాళ్ళు నొప్పులు పుట్టడటం లేదూ నీకు?"

"అబ్బే"—ఆమె అతనివంక ప్రేమతో చూస్తూ అన్నది.

అతను ఆత్మీయతతో మాట్లాడటం ఆమెకు మంచనిపించింది.

ఆమె అలా ప్రేమగా నవ్వటంలో అతని మనస్సులో ఉన్న ప్రేమ భావం ఎండిపోయింది. అతనికి కనిపించింది— తను వృధాగా ఆమెతో అలా అన్నాడనిపించింది. తను చూపించిన సహానుభూతి వృధా అయిపోయినట్లనిపించింది. ఆమె నవ్వించి తన తొందరతనం చూచి అనిపించింది అందుకని కటువుగా అన్నాడు. "ఇక్కడకాలం ఇలా వృధాచేస్తే ఇంటికి వెళ్ళేటప్పటికి చాలా ఆలస్యమవుతుంది."

"అబ్బే కాదు ఊరికే ఎందుకు టాక్సీకి డబ్బు ఖర్చుపెట్టటం" నేర్పరిలాగా మాట్లాడింది ఆమె. పేదరికంలో పెరగటంవల్ల ఈ నేర్పు ఆమెలో జీర్ణించుకుపోయింది.

కాని అతని కనిపించింది, డబ్బు పేరుతో తనని ఎగతాళి చేస్తున్నదని. ప్రపంచంలో తన తప్పులు ఎత్తి చూపటానికి ఎదురుచూస్తున్నదనిపించిందని అతని అభిప్రాయం. అతని స్వరం మళ్ళీ కటువైంది. "డబ్బును గురించి తెలిసింది— నీకెక్కువా నాకా?" అన్నాడు.

"మీకే—" అని తలతిప్పి నవ్వి— వప్పేసుకున్నది. ఆ చేష్ట చూచి అతని పెదవుల దాకా నవ్వు వచ్చింది. కాని ఆపుకున్నాడు. అతను తన కోపాన్ని నికరంచేస్తూ "నాకు టాక్సీ కావాలి" అన్నాడు.

"ఇంకేం కానీండి— మీకెలాతోస్తే అలా" అతను శత్రుత్వం ఎందుకు ధరించాలో— తన మాటే నెగ్గటానికి— ఎందుకింత అట్టహాసం చేస్తున్నాడో ఆమెకు అర్థంకాలేదు.

"టాక్సీ" అతను అరిచాడు. కాని టాక్సీ అతని వంక చూడకుండా వెళ్ళిపోయింది. ప్రపంచమంతా అతనిని అవమానించటానికి పూనుకున్నదన్న అతని అభిప్రాయం మరీ దృఢపడింది. కొంచెం సేపటికి ఇంకొక టాక్సీ కనిపించగానే అతను మరీ బిగ్గరగానే "టాక్సీ" అని కేకవేశాడు.

అంతలోనే ఆమె అన్నది— "ఆ! బస్సొచ్చింది— చాలా ఖాళీగా ఉంది కూడానూ—" ముందుకు వెళ్తున్న 'క్యూ' వెనక ఆమె పరుగెత్తి గెంతి బస్సెక్కి ముందుకు వెళ్తున్న "క్యూ" వెనక ఆమె పరుగెత్తి గెంతి బస్సెక్కింది. ఎక్కి వెనక్కి తిరిగి చెయ్యూపుతూ ధీరత్వంతో "రండి— రండి త్వరగా—" అని కేక వేసింది.

ఏదైనా అయితే టాక్సీలో వెళ్ళొచ్చని అతను వెనకాలే నిల్చుని ఉన్నాడు. కాని ఆమె అలా హడావుడి చేయబట్టి, వేరే మార్గమేమీ లేక అయిష్టంగా పరుగెత్తి బస్సెక్కాడు.

"మీరు ఆలస్యం చేశారు. లేకపోతే ఆ సీటు ఖాళీగా ఉంది—" సీటు వంక వేలు చూపిస్తూ అన్నది. ఆ సీటుమీద కూర్చున్న ముసలి పార్సీ వాళ్ళు తనవంక చూడగానే ఆమె సిగ్గుపడి ముఖం చేతుల్లో కప్పివేసుకున్నది. బస్సులో వాళ్ళందరూ, సరదా అనిపించి నవ్వారు. మనసు తీరా నవ్విన తరువాత ఆ పార్సీవాళ్ళు లేచి "కూర్చోండి అమ్మా—కూర్చో—" అన్నారు. ఆమె మరీ సిగ్గుపడి "వదండి—కూర్చుందాం" అన్నది. ఇంతసేపూ అతను ఆమె వెనుక ఇరకాటంగా నిల్చుని ఉన్నాడు. లోకులు తామంటే సానుభూతితో మాట్లాడటం అతనెరుగడు.

తనలాటి తెలివిగలవాడు, చదువుకున్నవాళ్ళకు చేతకానిది, పొరుగూరునుంచి వచ్చిన ఈ సంస్కారములేని పిల్ల తేలిగ్గా సాధించగలగటం అతనికి నచ్చలేదు.

"ఏదో ఒకటి తెలివితక్కువగా వాగుతావ్—" అణిచిపెట్టుకున్న స్వరంతో అన్నాడతడు.

"ఇందులో తెలివితక్కువేముంది. మనకైతే చోటు దొరికిందిగా బాగా—" చేతులు పైకెత్తుతూ తలపైకెత్తి అన్నది ఆమె.

"బొంబాయిలో అలా వాగరు. అలా వేళ్ళు చూపించకూడదు, బిగ్గరగా మాట్లాడకూడదూ."

"అయితే ఏమైంది. ఎవరు నన్ను గురించి అనలేదే?"

"అయితే వూరికే నవ్వారేం?"

"అబ్బే—అలా అని ఏం నవ్వలేదు వాళ్ళు—" తల అడ్డంగా తిప్పుతూ అన్నది. కాని, ఆమె మనసులో కల్లోలం బయలుదేరింది. తను నిజంగా తెలివితక్కువగా ప్రవర్తించినట్లనిపించింది. ఆమె కోరచూపులతో అందరివంక చూచింది. మనసులో సంకోచం కలిగింది. ఆమెకు సంకోచపూరితమైన మనస్థితి సహించరానిదైంది. దిటవు చేసుకుని తల పైకెత్తి—"అయితే అయింది. ఎంతైనా నేను పరాయివూరుదాన్ని, సంస్కారం లేనిదాన్ని—తప్పయితే అయింది" అన్నది.

"అలా సంస్కారం లేకుండా ఉండకూడదు. బొంబాయిలో మనుషులు 'స్మార్ట్' గా ఉండాలి. ఆ మాట్లాడినది—తనకు నచ్చలేదన్న సంగతిని నికరంచేస్తూ అతనన్నాడు.

"అయితే మీరే నేర్పండి నాకు స్మార్ట్‌గా ఎలా ఉండాలో ముద్దుగా ఆమె భుజంమీద ఆనింది.

"అలా చేర్పితే రాదు—స్వతహాగా రావాలి—" అతను ఆమెను వెట్టివేశాడు.

ఆమె నిరాశపడింది. తను వికరంగా సంస్కారం లేకుండా ఉండాలేమోనన్న భావం ఉదాసీనత కలిగించింది. ఒక్కసారి పుట్టిల్లు జ్ఞాపకం వచ్చింది. ఆమె కనిపించింది—అప్పటికప్పుడే అక్కడికి వెళ్లాలని, అక్కడ తన నెవ్వరూ సంస్కారంలేని దనరు. నవ్వుతూ, ఆడుతూ తన యిష్టం మొచ్చినట్లు వాగవచ్చు.

ఆమె ముఖం పాలిపోయింది. అది సహించలేనిదైనది. అతని భుజంమీద తట్టి నవ్వొచ్చే విషయమేదైనా చెప్పి నవ్వించా లనిపించింది.

తను ఏదో తప్పు చేసినట్లు ఆమె కనిపించింది. ఏదైనా మాట్లాడాలనీ, చేయాలనీ ఆమెలో కౌతుకం కలిగింది.

ఇంతలోనే ఆమె ముఖం మళ్లీ వికసించింది. మొరటుగా అతనితో అన్నది— "ఎందుకు రాదేం నాకు ? చేతౌతుంది. మా వూళ్లో సుమన్ స్మార్ట్ కాలేదా ? పెద్ద కొప్పు పెట్టుకునేది—బిగ్గరగా మాట్లాడేది ?—" ఆ సంగతి గుర్తుకొచ్చి ఆమెకు నవ్వు మళ్లీ ముంచుకువచ్చింది. క్షణంసేపు అతనికి, ఆమె వర్ణిస్తూ చేసిన హావభావాలూ, నవ్విన నవ్వూ ముద్దనిపించినై. బుగ్గలు క్షణంలో గిచ్చాలనిపించింది.

పరుగెత్తుతున్న బస్సులో అందరి సమక్షంలో అతను గనుక ఆమె బుగ్గ గిల్లినట్లయితే తనకు తను పెట్టుకున్న శిక్షనుంచి విముక్తి కలిగిఉండేదతనికి. కాని, అతను అలా చేయలేదు. చిలిపి కోరికను అతను అణిచివేసుకున్నాడు. అందుకని అతని ముఖం మరీ గంభీరమైంది. వద్దనీ అనిపించసాగింది.

ఇంతలో ఆమె మనసులో ఏదో మెరుపులాటి భారం కలిగింది—"కాలేజీకి వెళ్తే ఆడపిల్లలు స్మార్ట్‌గా ఔతారు కదూ ? మరి నన్ను కూడా కాలేజీలో జేర్చరాదూ ?"

"కాలేజీ కెళ్లాలంటే ఇంగ్లీషు బాగా వచ్చుండాలి ?" అతను పెద్దరికంగా అన్నాడు.

"మీకు ఇంగ్లీషు బాగా వచ్చుండాలిగా ? నాకు నేర్పరాదూ ? కాలేజీ సంగతులు చెప్పరాదూ ? చెప్పండి—" అతనివంక కౌతుకంతో చూచి ఉత్సాహంతో అన్నదామె.

"కాలేజీలో బాగా ఉంటుంది. అంటే మేము బాగా మజా చేశాము—మాదొక గాంగీ ఉంది. మేము ఏం మజా చేశామని—మైగాడ్ — లెక్చరర్లచేత గుంజీలు తీయించేవాళ్లం—"

"అంటే ?"

"అంటే—క్లాసుకి వెళ్లేవాళ్లంకాదు—వూరికే తిరిగేవాళ్లం—తాగాలనిపించినప్పుడల్లా — టీ తాగటము—సిగ్రెట్టు—షికారుకు పోవటం. ఎన్నో సినిమాలు చూచాం—ఎంతో మజా చేశాం—" అని అతను బిగ్గరగా నవ్వాడు.

ఆమె నవ్వినట్లయింది. ఏవిధంగా మజా చేసిందీ వినవచ్చని కౌతుకంతో అతనివంక చూస్తూ ఉండిపోయింది. ఆమె ముఖంలో ఎంత ఉత్సుకతున్నదో, అతను చెప్పేది వినవచ్చని ఆమె ఎంత సంతోషించిందో—ఆమెవంక చూసేటప్పటికి అతని ఉత్సాహం అంతా వీగిపోయినట్లయింది. ఆమె కౌతుకాన్ని తృప్తి పరచటానికి ఏదైనా గమ్మత్తయిన విషయం చెప్పగలనని అతని కనిపించలేదు. నిజానికి, అతను కొంచెం ప్రయత్నంచేసి ఉన్నట్లయితే, తన ఆత్మవిశ్వాసాన్ని వదిలిపెట్టకుండా ఉన్నట్లయితే అతనికి ఏదో గమ్మత్తయిన విషయం తోచిఉండేది. అది ఆమెకు చెపితే ఆమె సంతుష్టిపడేదేమో! ఎవరూ తనమీద శ్రద్ధ చూపించరు, కౌతుకం చూపించరు అని అతని అభిప్రాయం రూఢిపరుచుకున్నాడు. అందుకని ఇక అతనేమీ చెప్పటానికి ధైర్యం చాలలేదు.

అతనేమీ చెప్పకపోయేటప్పటికి ఆమె ఉత్సాహంతో అన్నది—"ఇంకా ? ఆ—ఇంకా ఏం మజా చేశారు ?"

"ఆ—నీకు ఏం తెలుస్తుంది ! నీకు చెప్పటుకు లాభమేమిటి ?" అని ఆమెను తిరస్కారంగా కొట్టి ఎదట చూస్తూ ఉండిపోయాడు.

పాపం ఆమె నిరాశపడింది. తను సంస్కారి అయితే బాగుండేది. తనకు అతను కాలేజీ విశేషాలన్నీ చెప్పుండే వాడు. నిజానికి తనకంతా తెలిసేదే—అతను చెప్పాల్సింది—అంటే—అతనిచేత చెప్పించటానికి ఏంచేయాలో ఆమె ఆలోచించసాగింది.

ఇంతలో బస్సు కిటికీలోనుంచి ఎగ్జిబిషన్ తాలూకు జయింట్‌వీల్ దగ్గరగా కనిపించింది. దానిమీద లైట్లు వెలుగుతున్నై. ఆ దీపాలు—పొందికగా తిరుగుతున్నై.

కళ్లు పెద్దవి చేసుకుని ఆమె ఆ చక్రం వంక చూస్తూ ఉన్నది. ఆమె మనస్సంతా ఉల్లాసపు ప్రతిబింబమే అయింది. అటు ఆ చక్రం క్షణం క్షణం కుదుపులతో పైకి వెళుతున్నది.

ఆ చక్రంవంక చూస్తూ ఆమె బస్సు దిగుతున్నది. సరిగ్గా చూడకపోవటంవల్ల, అతనిమీద పోయి పడిపడి. అతని శరీరం తిన్నగా అదిరి పడింది. అతను ఆమెను పట్టుకుని పడకుండా ఆపాడు. ఆపి కోపంగా అన్నాడు, "ఇదేమిటి ? చూసి నడు."

ఆమె తేలిగ్గా నవ్వేసింది. ఆమె మనసులో ఉన్న ఉల్లాసం మరీ ఎక్కువైంది. ఆమె శరీరం మరీ—మరీ తేలికైపోయింది. ఆమె ఆపుకోలేకపోయింది. అలాగే ప్రదర్శనశాలలోకి ప్రవేశించింది. ఆ ప్రదర్శనశాల ప్రాంగణంలో వెలుతురు ఎంతో తేజోవంతంగా వ్యాపించి ఉన్నది. ఉల్లాసపు బాణాసంచా నలువైపులా విరజిమ్మినట్లయింది. ఉత్తేజితమైన శబ్దం—పొగలాగా నాలుగు వైపులకూ వ్యాపిస్తున్నది—ప్రతిక్షణం రద్దీ—కొత్త మొక్కలు మొలవసాగినై. ఆ వాతావరణంలో ఆమె తేలిపోతున్నది. ఆమె మనసు ఎగిరిపోయి—ఆ చక్రపు తొట్టెలో ఒకదాంట్లో ప్రకాశిస్తున్న దీపమై పోయింది.

"పదండి—ఆ చక్రం దగ్గరికి పోదాం"— ఆమె ఉత్సాహాన్ని ఆపుకోలేక అన్నది. అని, విముక్తి పొందినట్లు ఆ చక్రంవైపుకు వెళ్లటం మొదలు పెట్టింది. ఇష్టంలేకపోయినా ఆమె వెనక కట్టి వేసినట్లు అతను వెళుతూనే ఉన్నాడు.

తన చోట్లో మెరుస్తూ తిరుగుతున్న ఆ చక్రంవంక చూస్తూంటే ఆమె మనసు నిండిపోయి, మెత్తబడిపోయినట్లయింది.

అతనలా వెనుకబడుతుంటే చూచి ఆమె అన్నది. "లోపల కూర్చోవద్దు—వూరికే చూచి వచ్చేద్దాం—పదండి."

విచిత్రమైన అయిష్టత అతన్ని ఆక్రమించుకున్నది. అతను చిరాకుగా అన్నాడు,



"ఏవిటేటి పిల్లచేష్టలు—చిన్నపిల్లలకుగాని పెద్ద వాళ్ల కూర్చోవటాని కేవిటి ?''

"పదరాదా ? ఏముందేవిటి ? కాసేపు పూరికే చూద్దాం—" బ్రతిమలాడుతున్నట్లు అన్నది. ఆమెకు అతన్ని చూస్తే కోప మొచ్చింది. ఇలాటి మనిషేవిటి అనిపించింది—ఉత్సాహంతోగాని, ఆనందంతో గానీ—ఎప్పుడూ ఏవనీ చేసి ఎరగడా ? ఆశ్చర్యంతో అతనివంక చూచింది. అసహాయంగా మళ్లీ అతన్ని ప్రాథేయపడింది—"అదేవిటండీ ? పదండి."—

ఆగలేక ఆమె మెల్లి మెల్లిగా ముందుకు వెళుతున్నది. ఇంత ప్రాథేయపడ్డాక తన మాట వినక పోడని ఆమె నిశ్చయం చేసుకున్నది. ఆమె అడుగులు టకటకమని వరసగా పడుతున్నై. మధ్య మధ్యలో వెనక్కి తిరిగి చూస్తున్నది— అతను కనుపించగానే ధైర్యం కలిగి ఇంకా ముందుకు పోతున్నది.

ఆమె ఉత్సాహంవల్ల బిగుసుకుపోయింది — చిరాకు పడుతున్నట్లుంది. తన చిన్నతనం ఆమెకు బాగా తెలియటం మొదలైంది.

ఆ చక్రం దగ్గరకు వచ్చింది. ఆమె అలా తెగించుకు ముందుకు పోతుంటే, అతను హఠం చేస్తున్నట్లు ఉన్నచోటే ఉండిపోయాడు. హఠం చేయటం కాకపోతే అసహాయత వల్లనేమో, విచిత్రమైన అయిష్టత, సంకెళ్ల మాదిరి అతని కాళ్లను చుట్టబెట్టుకుని ఉన్నచోటే బంధించి వేసింది.

అతను ఇక ముందుకు వెళ్లడు. ఆమె చిలిపి ఉత్సాహం వెనక అతను దేకుకుంటూ పోడు. కావాలంటే ఆమె ఒక్కతే ముందుకు వెళ్లి ఆ చక్రంలో కూర్చోనీ. అలాగని ఇద్దరూ విడిపోతే—అతని జబాబుదారీ ఏమీలేదు. ఆమె ఒక్కతే దారి కనుక్కుని ఇంటికి రావాల్సొస్తుంది.

విడిపోతే అన్న ఆలోచన రాగానే అతనికి భయమేసింది. ఆకర్షణ కూడా కనిపించింది. ఆమెకొకసారి అలాటి శిక్ష పడాలి. అలాటి మంచి పాఠం నేర్వాలి.

# చెలిమి

ఇంతలోనే ఆమె పదిహేను ఇరవై అడుగులు ముందుకు వెళ్లిపోయింది. ఆ చక్రము దగ్గర ఆ చుట్టూ ఉన్న రద్దీ దగ్గర కెళ్లి ఆగిపోయింది. ఆ రద్దీలో ఆమె వోడిపోతుందని అతని కనిపించింది. అందుకని ఆమెను కలుసుకోవటానికి చిర్రుబుర్రుమంటూ, భీరువుగా నడవటం మొదలెట్టాడు.

ఇంతలో ఓ గుంపు అడ్డమొచ్చింది. ఆ గుంపును తప్పించుకుని వంకరలు తిరిగి అటుపక్క కతను వెళ్లేటప్పటికి ఆమెకంటికి కనుపించలేదు. అతను అతను రెప్పవాల్చకుండా చూచినా గాని ఆమె ఎక్కడా కనుపించలేదు. భయంతో అతని శరీరం కదిలిపోయింది. అతనిలో ఉన్న నిర్లక్ష్యం ఇప్పుడు పారిపోయింది. అస్వస్థతుడిలా అతని శరీరం వణక సాగింది. ఆమెను వెతకటానికి అతను పరుగెత్త సాగాడు.

ఆమె ముందుకు బాగా ముందుకు వెళ్లిపోయింది. మధ్యలో ఒకసారి ఆమె వెనక్కు తిరిగి చూచేదే—కాని ఇంతలోనే ఎవరో ఒకళ్ల ఆమె వెనక్కు వచ్చి దగ్గరగా నడవసాగారు. ఆమె కనిపించింది— అతనే తన వెనక వస్తున్నాడని అందుకని ఆమెలో స్వేచ్ఛ అనిపించింది. ఆమె శరీరం పులకించింది. తల పైకెత్తి సావకాశంగా తిరుగుతున్న ఆ చక్రంవంక, ప్రకాశిస్తున్న చక్రం వంక చూస్తూ ఉన్నది. ఒకొక్కతోట్టే—ఎగిరెగిరి పడుతూ పైకి—పైకి పోతున్నది. కడుపు నిండి పోయినట్లయింది. చక్కిలిగిరి పెట్టినట్లు, అంతలోగా క్రిందినుంచి పై కెగ్రబాకి శరీరాన్నంతా ఆక్రమించింది.

ఆమె స్పృహ లేనట్లు అతని శరీరంమీద వాలిపోతూ అన్నది. "పదరాదూ!—ఒక్కసారి ఆ చక్రంలో కూర్చుని వద్దాం— ఒక్కసారి" ఆమె వానుకని ఆమె వెనకాల ఉన్న మనిషి ఆమె భుజం పట్టుకుని—"పద" అన్నాడు. ఉక్కులాగా, మొరటుగా ఉన్న పట్టు ఆమె భుజాన్ని పట్టుకున్నది. భయపడి ఆమె అతనివంక చూచింది. అత నెవరో పరాయివాడు— కాలిన రంగులో ఉన్నాడు. అతని కంటిపాపలు పచ్చగా ఉన్నై. అతని కళ్లు వెలిగించిన వత్తుల్లాగా ఉన్నై. ఆమెకు వళ్లు తిరిగినట్లయింది. ఆమె శరీరం ఏకిన దూదైంది. చూపు వికృతమైంది. ఆ చక్రానికున్న వెలుగుతున్న దీపాలన్నీ ఆమె శరీరంమీద పడ్డట్టయింది. ఆమె శరీరం కాలి బూడిదైపోతున్నది. ఏదో ఆమె గొంతుకు అడ్డంపడి బంధించివేసింది— మాట రాకుండా.

అతని చేతులో నుంచి ఆమె విడిపించుకోవాల్సి ఉంది. బిగ్గరగా కేక లేయాల్సింది. ఆమె మత్తు చల్లినట్లు అతనివెంట ఏడెనిమిది అడుగులు వేసింది. ఇక ఒక్కసారి ఆమెకు బలం వచ్చింది. ఆమె తన చేయి విదిలించుకు లాక్కున్నది. బిగ్గరగా కేకవేసి పిచ్చిదానిలా పరుగెత్తిపోయింది.

ఆ మనిషి, ఆ రద్దీలో కలిసిపోయాడు. అందరూ ఆమెవంక ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు. కొందరు—'ఏమైందని' అడగటానికి ముందుకొచ్చారు. ఆమెకు ఎవరిమీదా విశ్వాసం నిలవటం లేదు. ఎవరితోటీ చెప్పటానికి ఆమె యిష్టపడటంలేదు. ఆమె శరీరమంతా వణికిపోతున్నది. ఒక స్తంభాన్ని పట్టుకుని ఆమె నిల్చున్నది. ఆమె కళ్లలోనుంచి కన్నీళ్లు కారుతున్నై.

ఆమె ఉత్సాహమంతా మసైపోయింది. ప్రపంచంమీద ఆమెకు మామూలుగా కలిగే విశ్వాసమూ అనే ప్రవాహం— ఖాళీ అయిపోయినట్లయింది. ఆ కోలాహలమూ, ఆ చక్రమూ—ఏదీ ఆమె కక్కర్లేదనిపించింది. ఆమె— తన యింటికి వెళ్లాలని ఉన్నది. చెల్లెళ్లతోటీ, స్నేహితురాళ్ల తోటీ కలిసి పక్కలమీద కూర్చోవాలనిపించింది. ఈ బొంబాయి తనకొద్దు, అత్తవారిల్లూ వద్దు ఆయనా వద్దు.

ఆమె తప్పిపోవటం—ఐదు నిముషాల వరకే.

కొద్దిసేపటికే ఆమె అతనికి కనుపించింది. అతను పరుగెత్తుకుంటూ వచ్చి ఆమె చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. భయంవల్ల ఆమె ఇంకా గాబరాగానే ఉంది. అతనిలో ఉన్న మందం వదిలిపోయింది. తను పెద్ద తప్పుచేసినట్లు అతని కనుపించసాగింది. ఆమె దొరికినా గాని, అతని మనస్సు పూరికే ఆందోళన పడుతూనే ఉన్నది. అతన్ని చూడగానే ఆమె మరీ బిగ్గరగా ఏడవసాగింది. అందుకని అతను మరీ గాబరాపడ్డారు— సిగ్గుపడ్డాడు. "ఊ—ఊ ఎందుకలా పిచ్చిదానిలా ఏడుస్తావు—నవ్వుతారు—ఊ—కళ్లు తుడుచుకో."

ఆమె అలా చేయలేకపోవటంతో అతనే తన రుమాలు తీసి ఆమె కళ్లు తుడిచాడు. ఆమెను రెండు చేతులతోతోనూ పట్టుకుని తనతో చాటున నడిపించుకుపోతూ, ఉత్సాహంతో అన్నాడు:

"పద—ఆ చక్రంలో కూర్చుని వద్దాం. అప్పుడు నీ కింకా సంతోషంగా ఉంటుంది" ఆమె అతని చెయ్యి గట్టిగా పట్టుకుంటూ అన్నది—"వద్దు— నా కిప్పుడేమీ వద్దు. ఇంటికెళ్దాం పదండి."

"ఛీ—ఏమిటా పిచ్చిపని. పద——మనం ఆ చక్రంలో కూర్చుందాం. మంచి గమ్మత్తుగా ఉంటుంది నీకు. తరువాత ఆ రెండో చక్రంలో



కూర్చుందాం—ఎలెక్ట్రిక్ బస్సులో కూర్చుందాం." ఆమెను సంతోషపెట్టటానికి అతనెంతో ఉత్సాహంతో చెబుతున్నాడు. ఆమె ముఖం అదివరకు మాదిరి ఉత్సాహంతో నిండిపోవాలని, ఆమె కళ్లల్లో వెనకటి ఉత్సాహం తాండవమాడాలనీ—అదివరకు మాదిరిగా కోపంలేకుండా ఆమె వాగాలనీ అతని కోరిక. ఆమెను పట్టుకుని ఆ చక్రంలోని ఒక ఉయ్యాలలోకి తీసుకెళ్లాడు.

తల పైకెత్తి ఆమె—ఆ బ్రహ్మాండమైన చక్రంవంక చూచింది. ఆమెకు భయమేసింది. అతని చేతిని పట్టుకున్న పట్టు బిగువు చేసింది. కుట్టేసినట్లుగా అతన్ని అతుక్కుపోయింది.

మెల్లిమెల్లిగా ఆ ఉయ్యాల పైకి పోవటం మొదలుపెట్టింది. మధ్యమధ్యలో గతులకు ఎగిరినట్లుగా ఎగరసాగింది. ఆమె పొట్టలో ఏమిటోగా ఉన్నది. క్రిందకు చూడటానికి ఆమె కేమాత్రమూ ధైర్యం కూడటంలేదు.

అతను ఉత్సాహంతో బడబడ వాగుతున్నాడు. తన ఉత్సాహాన్ని తేసతేపకు పెంచుకుంటున్నాడు—"చూడు— ఎంత మజాగా ఉందో ? పైన ఉయ్యాలలో పిల్లలు చూడు ఎలా ఎగురుతున్నారో ! క్రింద—ఆ మనుష్యులు చూడు ఎలా గున్నారో—మన మిక్కడినుంచి వాదింజపండో, అరటిపండో, విసిరివేశామనుకో. ఎవరినోట్లోనో పడుతుంది.వాళ్లు తలెత్తి పైకి చూస్తారుపిల్లలు—"

అతను ఆ వినోదంలో మునిగి తేలుతున్నట్లున్నాడు. ఆమె మాత్రం భయంవల పూర్తిగా గాలి పీలవకుండా నవ్వింది. అతన్ని ఇంకా గట్టిగా పట్టుకున్నది.

"క్రిందకు చూడరాదూ—ఎంత కిందకెళ్లిపోయిందో నేల. చూద్దూ—" అతను ఆమె బలవంతపెడుతున్నాడు.

ఆమె అప్రయత్నంగానే క్రిందకు చూచింది. ఆమె చూపులు ఒక్కసారి క్రిందకు దూకినై అక్కడే ఉండిపోయినై.

భయపడిపోయి ఆమె బిగ్గరగా అరిచింది. అరిచి అతన్ని గట్టిగా కౌగలించుకున్నది. అతను పొరలు పొరలుగా నవ్వాడు. లైట్ల కాంతిలో వెలుగుతున్న ఆ ప్రపంచంలో పైన ఉన్న చీకటిలో ఎగురుతూ అతను గలగలా నవ్వాడు. అతనిలో అదివరకు కట్టకట్టుకుని ఉన్న విషణ్ణతా, భావధాహిత్యముల తాలూకు అనకట్ట ఒక్కసారి కొట్టుకుపోయింది. అతనిలో దాగిఉన్న చైతన్యం గంతులేస్తూ పరవళ్లు తొక్కుతూ అతని మాటల్లో విరుచుకుపడసాగింది.

నవ్వటం ఒక్కసారి ఆపి అతను విచ్చుకున్న కళ్లతో ఆమెవంక వోసారి చూచి, దగ్గరకు తీసుకుని దీర్ఘంగా చుంబించాడు. ★

# హృదయ కుసుమాలు

## 27వ పేజీ తరువాయి

తెల్ల చీరె, ముస్తాబూ. గదిలోకి వెళ్లాక నా కన్నీరు నాకే ఉంది. అంతకన్నా నాకు మిగిలిందేమిటి? మంచంమీద కూర్చున్నాను. నన్నుచూసి క్షణం ఊరుకుని "ముఖంమీద బొప్పి తగ్గిందా, చెయ్యి వాపు ఎట్లా వున్నది" అంటూ నా ముఖంమీద బొప్పిని చూశారు. నేనేం మాట్లాడలేదు.

"చూడు జానకీ, ఎంత మనస్సు సరిపెట్టుకుందామనుకున్నా సరిపెట్టుకోలేక పోతున్నాను. నిన్ను చూస్తుంటే మీ చిన్న మావయ్య, ఆ నీచుడు గుర్తుకొస్తాడు. నేను అవునంటున్నాను. నువ్వు కాదంటున్నావు. ఏది నిజం? ఏది అబద్ధం? నువ్వు శీలవతివనీ అనటానికి ఆధారం ఏది? కాదనటానికి నా అంతరాత్మ చెప్పిందే నాకు ఆధారం. నిజం చెప్పు జానకీ, తప్పు ఒప్పుకుంటే ఎంత బాగుంటుందో ఆలోచించు" అన్నారు. నేనేం మాట్లాడాలో నాకు అర్థంకాలేదు. వారి కళ్లల్లోకి చూస్తూ కన్నీరు పెట్టుకున్నాను. నా వైపు వారు తిరిగి చూడలేదు. నాతో మళ్లా మాట్లాడలేదు. ఆ రాత్రి ఎట్లా తెల్లవారిందో నాకు తెలీలేదు.

రెండు రోజులు అట్లాగే గడిచినయ్యి. మూడో రోజున నా దుఃఖాన్ని నాలో ఇముడ్చుకోలేక పోయాను. నేను నిర్దోషిననీ, అనవసరంగా చిన్న మావయ్యతో నాకు సంబంధం అంటగట్టారని పోనీ మా ఇద్దరినీ ఎరుగున్న వాళ్ల నందర్నీ అడిగి తెలుసుకోమనీ ఎన్నో విధాల నచ్చచెప్పాను. ప్రాధేయపడ్డాను. ఈ రీతిగా జీవించేకంటే చావే నాకు శరణ్యమన్నాను. అన్నీవిని ఒక్కమాట చెప్పారు.

"జానకీ, జరిగిందేదో జరిగిపోయింది. నిన్ను నేను పదిసార్లు అన్నా, నన్ను నేను తిట్టుకున్నా ఏమీ ప్రయోజనంలేదు. మన అంతర్యాలూ, అంతఃకరణలూ ఎట్లావున్నా ఇద్దరం మూర్ఖులం కాదు. చదువుకున్న వాళ్లం. తాళిగట్టిన సంబంధమే తప్ప, తాకవలసిన సంబంధం తెంచుకున్నాను. మమతలు రేపుకోకు. వాంఛలు మనస్సులోకి రానీయకు. లోక దృష్టిలో మనం ఆదర్శ దంపతులమే. చిలకా, గోరువంకలమై, అనుకూల దాంపత్య జీవితం గడుపుతున్నట్లే లెక్క. కాని బయటపడి అందరి దృష్టిలో అల్లరిపాలు కావద్దు. నే చెప్పినట్లు నడచుకుని, ఇంకా నా మనస్సులో సంక్షోభం లేకుంటే నాకు అంతేచాలు" అన్నారు. సీతా ! నిజం చెప్పుతున్నానే ! నా తల నేలనేసి బాదుకున్నాను. శాశ్వతంగా ఈ లోకాన్ని విడిచి వెళదామనుకున్నాను. రాత్రిళ్లు నిద్రలేదు. ఇద్దరి మనస్సుల్లో, హృదయాల్లో అగ్నిగుండం భగభగమంటున్నది. కాని చచ్చి సాధించేది ఏముంది? అనుమానం నిజమేనని అనుకునేటట్లుగా చెయ్యడంతప్ప. వారు చెప్పినట్లుగా ఉంటానికే నిశ్చయించుకున్నాను. అనుమానమనే హాలాహలాన్ని మింగి గొంతులో ఉంచుకున్నాను. అది మింగటమో, తిరిగి వమనం చేసుకోవటమో, కాలానుగుణంగా జరగవలసిందేఅన్నది అన్నది అక్కయ్య.

అక్కయ్య మాటలు వింటుంటే నాకు మనస్సు వికలమై పోయింది. కళ్లార్పకుండా అక్కయ్య వైపు చూస్తూ కూర్చున్నాను. అక్కయ్య మళ్లా చెప్పసాగింది.

"ఒకరోజున కాలేజికి వెళుతూ జానకీ సాయంత్రం సినిమాకి పోదాం, తయారుగా ఉండు" అన్నారు. నా బ్రతుక్కి సినిమా ఒక్కటే తక్కువైంది. వారి భావం వేరు. అది లోకాన్ని వంచించటానికి. మరి లోకం దృష్టిలో మేం ఆదర్శ దంపతులం. నేను లెక్చరుగారి భార్యను. ఎంతో ఆలోచించి సరేనన్నాను" అని ఆగింది అక్కయ్య.

"తరువాత" అన్నాను ఆదుర్దాగా.

ఆ రోజున జరిగిన సంఘటనే నా జీవితానికి గొడ్డలిపెట్టుగా తయారయింది. సినిమాకు బయల్దేరాము. దార్లోనే వారి స్నేహితులిద్దరు కనిపించారు. కాలేజీలో వాళ్లిద్దరూ మా బావతో చదువుకున్నారుట. రాజమండ్రి కాలేజీలో వాళ్లిద్దరూ లెక్చరర్లు. అనుకోకుండా తారసపడ్డ ఆ ఇద్దరు మిత్రుల్ని వదల్లేక, తను వాళ్లతో వెడతాననీ, నన్ను సినిమాకు వెళ్లమనీ అన్నారు. నేను ఇంటికి వెళ్లి పోతానన్నాను. సరేనన్నారు. ఇంటికి వచ్చేసి జరిగిన విషయం అత్తయ్యకూ— సుభద్రకూ చెప్పాను. ఆ రోజునుంచి శివాలయంలోపురాణం మొదలు. నేను రాగానే అత్తయ్య, మావగారూ పురాణానికి వెళ్లారు. సుభద్ర స్నేహితురాలింటికి వెళ్లొస్తానన్నది. ఆ సమయంలో ఇంట్లో నేనొక్కర్తెనే. అప్పటికి ఏడు గంటలయింది. ఏం తోచక వీధి గుమ్మంలో రెండు నిమిషాలు నిల్చున్నాను. అంతకన్నా వ్యవధిలేదు. "ఏమ్మా, జానకీ, ఇక్కడుంటున్నారా. చాలా కాలానికి చూశాను" నేను చదువుకున్న ఏలూరు కాలేజిలో లెక్చరరు మోహనరావుగారు పలకరించారు. మోహనరావుగారంటే కాలేజిలో అందరికీ ఎంతో గౌరవం. ఆయన తండ్రివంటివాడు. రిటయిరు కాబోయే వయస్సుకూడా వచ్చింది. ఆయన ఫిజిక్సు లెక్చరరు. నాన్నగారిక్కూడా తెల్సు. నా బ్రతుక్కు తోడు వారితో ఏం మాట్లాడనని. ముక్తసరిగానే సమాధానం చెప్పాను. ఆయనా, కుశల ప్రశ్నలువేస్తూనే నిల్చునే మాట్లాడారు. నాకూ గుండెలు కొట్టుకో సాగినయ్యి—ఇదేం తప్పవుతుందోనని. వాకిట్లోకి రాకుండా ఉండేది. మోహనరావుగారితో మాట్లాడుతున్న సమయంలోనే మా బావ వస్తున్నారు. "వస్తానమ్మా జానకీ" అంటూ ఆయన ఇటు వెళ్లారు. అటు నుంచి మా బావ వచ్చారు. వారు రాగానే అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని ఇంట్లోకి వచ్చాను. అనుకున్నట్లుగానే పెద్ద తుఫాను చెలరేగింది.

"ఏం జానకీ ! పరమ పతివ్రతవు. నాతో సినిమాకు బయల్దేరి, మధ్యలో నేను స్నేహితులతో వెడితే, నువ్వు సినిమాకు వెళ్లనని ఇంటికొచ్చి చేసే ఘనకార్యం ఇదేనన్నమాట. ఇంకా ఎన్నాళ్లు నా కళ్లు మూస్తావ్ జానకీ, నీ ప్రియుల్ని ఒకొక్కరినినే చూస్తున్నాను. ఎంతకి తెగించి పోయావే. ఛీ!నీముఖం నాకు చూపించకు"అంటూనే వెంటనే వీధిలోకివెళ్లిపోయారు. నా ప్రాణం నిలువునా నీరయిపోయింది. అనవసరంగా అనుమానాలు పెంచుకుని నన్ను వారెంత నీచంగా చూస్తున్నారో, అట్లాగే జరిగే సంఘటనలుకూడా దానికి తగినట్లుగానే సమకూరుతున్నాయి. అత్తయ్యతో ఈ విషయాలు చెపితే, నాయందు విజంగా, లోపం ఉంటుందనుంచే తన కొడుకు అనుమానానికి హేతువని ఆవిడా అనుకోవచ్చు. అప్పుడు నా వేలితో, నా కన్ను, నేనే పొడుచుకోవటమవుతుంది. ఆ పరిస్థితుల్లో నా కన్నీరే నన్ను సేద తీర్చకలిగేది. నా మనోభావాలే నా నిదానమే నాకు శ్రీరామ రక్ష అనుకున్నాను" అన్నది అక్కయ్య.

# హృదయ కుసుమాలు

"బావ ఇంత చదువుకున్నవాడు, అన్నీ తెల్సినవాడూ అంత మూర్ఖుడుగా, అంత గుడ్డి నమ్మకాలతో, అర్థంలేని అనుమానాలతో ప్రవర్తించటానికి కారణం" అనడిగాను.

"నేను చెప్పబోయేదీ అదే సీతా. అనుమానాలకి చెవులే గాని, కళ్ళు లేవు. నమ్మకమే గాని ఋజువు లేదు. ఆ రాత్రి ఇంటికొచ్చాక వారు స్నానం చెయ్యలేదు. భోజనం చెయ్యలేదు. మాట్లాడకుండా పడుకున్నారు. మెల్లిగా వెళ్ళి వార్ని పలకరించాను.

"ఎందుకండీ నామీద ఈ అపవాదులు వెయ్యటం నాలో ఏ లోపంగాని, నా ప్రవర్తనలో ఏ దోషంగాని చూసి నన్నిట్లా అనుమానిస్తున్నారో నాకు అర్థం కావటంలేదు. చదువుకున్నవారు, సర్వమూ తెల్సినవారూ, నలుగురులోనూ గౌరవ మర్యాదలతో తిరగనేర్చినవారూ, విద్యార్థులకు హితోక్తులు చెప్పేవారూ, మీరే ఇట్లా అపోహలు పెంచుకుని మానసికంగా నన్ను బాధపెడుతూ, మీరూ బాధపడుతూ కృంగిపోతుంటే నేను ఎట్లా నా నిర్దోషిత్వాన్ని ఋజువుచేసుకోవాలో నాకు తెలీటంలేదు. నా మనస్సు మీకు తెల్సు. నేను వాళ్ళతో మాట్లాడాననేగా మీ అపోహలు ఆరోజు కారోజుకు ఇంకా ఎక్కువ కావటానికి కారణం" అన్నది అక్కయ్య.

"బావ ఏమన్నారు జానకీ" అన్నాను.

"బావ ఏమన్నా రంటావా, ఏమన్నారని చెప్పను. సీతా, పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతుంటే ఎవ్వరూ చూట్టంలేదనే అనుకుంటుంది. ఆరోజున సినిమాహాల్లో నీ స్నేహితుడూ, ఈరోజున ఎవ్వరూ లేని సమయంలో రాత్రిపూట మీ లెక్చరరు, బ్రతికున్న రోజుల్లో మీ చిన్నమామయ్య, నన్నింక మోసపుచ్చలేవు జానకీ. ఇంక ఎంతమంది ఉన్నారో నీ పాత స్నేహితులు" అన్నారు మీ బావ నా మనస్సు ఉడికిపోయింది. అవమానంతో కుమిలిపోయాను.

"ఈ ఆధారాలు చూసే నన్ను అనుమానిస్తున్నారు కదూ. మీ మనసులో పూడిపోయిన భావాలనూ, అనుమానాలనూ నేను మాటలతో, నా చేతలతో తీర్చగలిగే శక్తిని నాకు కలిగించమని ఆ పరమాత్మని వేడుకొంటున్నాను. మీతో ఇప్పుడు వర్పించగలిగే శక్తి సామర్థ్యాలు నాకు నిజంగానే లేవు. ఎంత చదువుకున్నా, ఎన్ని తెలివితేటలున్నా ఆడదాని జీవితమే అంత. పోనీండి. ఒక్కమాట అడుగుతున్నాను. మీరు కాలేజీలో లెక్చరరుగా ఉంటున్నారు. అనేకమంది విద్యార్థినులు ఉన్నారు. అందరితోనూ మీరు మాట్లాడుతారు. వాళ్ళకి పాఠాలు చెపుతుంటారు. మీమీదకూడా నేను అపోహలు పడొచ్చుగా" అన్నాను.

ఈ మాటకి వారు రెచ్చిపోయారు.

"నోర్ముయ్. నీ బ్రతుక్కి నన్ను అనుమానించి ఎదిరిస్తున్నావా. మా కాలేజీలో విద్యార్థినుల కాలిగోటికూడా నువ్వు సమానంకావు. ఛీ, నీ ముఖం చూపించకు." అంటూనే నా చెంపమీద అయిదు వేళ్ళూ తేలేటట్లు కొట్టారు. నా తల తిరిగిపోయింది. అయిదు నిమిషాల వరకూ నా వళ్ళు నాకు తెలీలేదు. నాలో సహనం నశించింది. నా కన్నీరే నాకు కొంత మనశ్శాంతి నిచ్చింది. నా మనో నిబ్బరమే ఏనాటికయినా వారిలో పరివర్తన తేగలదు. నా సౌశీల్యమే నాకు శ్రీరామరక్ష. ఏనాటికయినా వారి తప్పు వారు తెల్సుకోక పోరు. అప్పటివరకూ మా ఇద్దరికీ ఈ మానసిక బాధ తప్పదు" అన్నది అక్కయ్య.

ఒకసారి కళ్ళు తుడ్చుకుంది అక్కయ్య.

"ఆరోజునుంచీ వారు నాతో సరిగ్గా మాట్లాట్టమే మానేశారు. వారితో వాదాన్ని నే పెంచలేదు. గృహిణిగా నా కర్తవ్యాన్ని నేను నెరవేర్చుకుంటున్నాను. ఇదంతా జరిగిన వారం రోజుల్లో శ్రావణమాసపు నోములకు పంపమని నాన్నగారి దగ్గర్నుంచీ ఉత్తరం వచ్చింది. మీ బావను అడిగాను, నోములకు వెళ్ళమంటావా అని. అందుకు వారేమన్నారో తెలుసా సీతా" అని ఆగింది అక్కయ్య.

నేను ఆదుర్దాగా చూశాను.

"వరలక్ష్మి అమ్మవార్ని ఏమని ప్రార్థిస్తావు జానకీ" అన్నారు. ఇంత చక్కగా మాట్లాడుతున్నా రేమా అనుకున్నాను.

"ఎన్ని జన్మలకన్నా మీరే నా భర్త కావాలని కోరుకుంటాను. మీరు నామీద ఎప్పుడూ ప్రేమ, ఆదరాభిమానాలతో ఉండాలని ప్రార్థిస్తాను." అన్నాను నవ్వుతూ. నేను ఎంత సంతోషంగా మనస్ఫూర్తిగా ఈ మాటలు అన్నానో వారు నా మాటల్ని అంత చులకనగా తీసేశారు.

"అంతా అబద్ధం, అంతా అబద్ధంజానకీ! అట్లా కోరుకోవు. తల్లీ వద్దనకొద్దీ ఈ జన్మలో నాకీభర్తని ప్రసాదించావు. కనీసం వచ్చే జన్మలోనయినా, ఈ జన్మలో నేను ప్రేమించిన ప్రేముల్లో ఒక్కర్ని, తల్లీ అని ప్రార్థిస్తావు" అన్నారు. అంత ఈర్ష్యగా, పాతుకుపోయిన అనుమానపు భావాలతో ప్రతి విషయంలోనూ శూలాల్లాంటి మాటల్తో పొడుస్తుంటే నా మనస్సు ఎంత ఉడికిపోతున్నదో వారు ఏమాత్రం అర్థంచేసుకోవటం లేదు. తప్పు ఉన్నప్పుడు ఆ మాటల్ని పదిసార్లు ఏకరువుపెట్టి నిందించినా ఆ మాటలు పడవలసిందే. లేని తప్పును అనుమానాలతో నామీద ఆరోపణచేసి కట్టుకున్న భర్తే నన్ను అవినీతిపరురాలుగా చిత్రిస్తుంటే ఆ పరిస్థితుల్లో నేనేం చెయ్యాలో ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదే సీతా, సంసార జీవితంలో అడుగుపెట్టిన మొదటిరోజునే నన్ను శంకించే భర్తని ఏవిధంగా అర్థంచేసుకోవాలో నే నెంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను. ఇతవరకూ జరిగిన విషయాలు నీతో చెప్పాను" అన్నది అక్కయ్య.

ఇంతవరకూ చెప్పి రాధవైపు చూస్తూ కూర్చుంది సీత—

సీత చెప్పిన ఈ సంగతులన్నీ రాధ విన్నాక జానకి విషయంలో ఒక అభిప్రాయానికి వచ్చింది.

రాధ, సీతతో అన్నది—

"సీతా, మీ అక్కయ్య సంసార జీవిత కథనంతా విన్నాక నేను ఏ నిశ్చయాని కొస్తానో చెప్పలేను గాని ఇంతవరకూ జరిగినట్లు చెప్పిన పరిస్థితుల్ని బట్టి ఒక యదార్థ సత్యం మాత్రం నాకు అర్థమైంది. మీ అక్కయ్య చదువులో ఫస్టుక్లాసులో ప్యాసయింది. కాని, జీవిత పరీక్షల్లో అసలు ప్రశ్నల్ని అర్థంచేసుకునే పరిస్థితిలోనే లేదు. మీ బావకు ఎట్లా నచ్చచెప్పాలో, అవసరం వచ్చినప్పుడు ఎదిరించి ఎంత కటువుగా మాట్లాడాలో మీ అక్కయ్యకు తెలీలేదు. కటువుగా మాట్లాడితే అసలు కాపురానికే ఏం ముప్పు కలుగుతుందోనని మీ అక్కయ్య భయం. ఆవిడ మెతకతనాన్ని ఆసరాగా తీసుకొని ఇంకా అనుమానిస్తున్నారు మీ బావ. ఆ భార్యాభర్తల మనస్తత్వాలు ఒకటి దక్షిణ ధృవం, ఒకటి ఉత్తరధృవం. ఇంక ఆ సంసార జీవితంలో సుఖ మెక్కడ ఉంటుంది చెప్పు ? ఒకరు పులి, ఒకరు మేక. అంతేనా సీతా" అన్నది రాధ.

సీత కళ్ళు తుడ్చుకున్నది. తానేమయినా తప్పు మాట అన్నానా అనుకుని మనస్సులో బాధపడింది రాధ.

సీత భోజనానికి వెళ్దామన్నది. రాధ కూడా సరే నన్నది. ఇద్దరూ భోజనాలకు లేచారు. సీతకు అన్నం సయించలేదు. రాధ అంతా చూస్తూనే వూరుకుంది. రాధ భోంచేసేదాకా సీత వూరికేనే కూర్చుంది.

"మీ అక్కయ్య ఇప్పుడు ఎక్కడున్నది సీతా" అన్నది రాధ.

ఒక్కసారి రాధ ముఖంలోకి చూసి సీత నవ్వింది.

"మా అక్కచెల్లెళ్ళ జీవితచరిత్రలు పూర్తిగా వింటే నీకే తెలుస్తుంది 'రాధా'అన్నది సీత.

రాధ ఇంకేం మాట్లాడలేదు. (సశేషం)

---

ఉపన్యాసకుడు : మీరంతా ఎక్కువ కష్టపడి ఎక్కువ ధాన్యాన్ని పండించాలి.

ఒకడు సభలోనుంచి పెద్దగా అరిచాడు: మరి పశువులకు మేత సంగతో ?

ఉపన్యాసకుడు : ఆగండి ! నేనిప్పుడు మనుష్యుల్ని గురించి మాట్లాడుతున్నాను. ఇంకా సేపట్లో మీ అవసరాన్ని గురించి కూడా చెప్తాను.

ఎం. రామమోహనరావు (తెనాలి)

---

మెజిక్

సత్యమూర్తి

గెస్ట్ కార్టూనిస్టు:-
చదువుల్రావు
జయశ్రీ

నువ్వూ వాడూ మాట్లాడుకోటంలేద
ని విన్నా. ఏమైనా గొడవపడ్డారా?

ఇంక వెళ్దామా గురూ?

చందూకి హోటళ్ళలోను టీపార్టీల్లో
నూ, చెంచాలు కొట్టేయడం హాబీ...

రాధపుట్టినరోజు టీపార్టీలో
కూడా ఎంత చెప్పినా వినకుండా
కోటు జేబులో ఒక చెంచా దాచేడు.

టీ పార్టీలో రాధావాళ్ళు నన్ను
ఏడిపించడానికి ఒకపాట పాడమన్నారు

పాడాలి

నాకసలు పాటలు పాడమే రాదని
బ్రతిమాలి చెప్పేను

ఇప్పుడు రాని వాళ్ళు పాడిందే
బాగుంటుందండి లేకపోతే
మెజిక్కు లేపైనా చెయ్యండి.

లేడీస్ అండ్ జంటిల్
మెన్, నా చేతిలోని
ఈ చెంచా చూడండి.

మీ కళ్ళ ఎదురుకుండా
ఈ చెంచాని జేబులో
వేసుకున్నా...

ఇప్పుడు ఆ చివర కూర్చున్న
తని
కి, ఇదే
కోటు జేబులో
చెంచాని
రప్పిస్తాను...
ఇప్పుడు
చూడండి

ఆశ్చర్యం. నిజంగానే
రప్పించాడే

వండ్రఫుల్, అద్భుతంగా ఉంది
మెజిక్

వాడు జేబులో పెట్టుకున్న చెంచాని
బయట పట్టేసుకొని, నా జేబులో
పెట్టుకున్నది నా దగ్గర
ఉందే

సత్యమూర్తి

# 24.

'రండయ్యా రండి ! చేరండి, యుద్ధంలో చేరండి..''— మన దేశం కోసం, మన ప్రభువు కోసం, మనం ప్రాణాలు త్యాగం చెయ్యాలి ! ఇలా త్యాగం చేసిన వాళ్లందరికీ వీరస్వర్గం ద్వారాలు తెరుచుకుని ఉంటుంది. తెలుసా ?— లెండి !— చూస్తారేం ? లేవండి ! ! నడుములు కట్టండి!!! అంటూ రాజోద్యోగులు దేశం నలుమూలలా ఆవేశంతో ప్రబోధం చేస్తున్నారు.

ఆ ప్రబోధంలో ధనాశ చూపించారు. నయానా భయానా చెప్పి చూశారు. రాక్షస జాతిలో యువకుల నందర్నీ సైన్యంలో సమీకరించటానికి సకల యత్నాలూ చేశారు.

దేశం కోసం, రాజుకోసం త్యాగం చెయ్యడం ప్రజల కనీస ధర్మమనీ నొక్కి చెప్పారు, నూరి పోశారు. ఈ మాటలు విన్నవాళ్లని మర్యాదగా వెంట బెట్టుకు వెళ్లారు. వినని వాళ్లని బలవంతంగా లాక్కుపోయారు. అధికారుల మాటలకు అడ్డుచెప్పినవాళ్లంతా అష్టకష్టాలూ అనుభవించారు!

ఈ విధంగా సింధురాజుకు గొప్ప సైనిక బలం సమకూడింది !

ఇప్పుడు జయసింధు మామూలు ధోరణిలో లేడు. అతనికి కుడిచెయ్యిగా ఉంటున్న అనలుడు మరణించినప్పటి నుంచీ చెప్పలేని చీకాకులో పడ్డాడు. అందుచేత, ప్రభువు సముఖానికి వెళ్లాలంటే మంత్రి వర్గానికే భయం పట్టుకుంది.

కొంతమంది రాక్షస యువకులు సమయం, సందర్భం తెలియక మునుపటిలాగానే దసవుతో

# కార్యసిద్ధి

10 వ పేజీ తరువాయి

రాజుకు సలహా ఇవ్వబోయేసరికి, ఉన్నపాటున వాళ్ల పుచ్చెలు ఎగిరి పొయ్యాయి !

దీనికితోడు, బందిఖానాల్లో ఉంటున్న దేవతలూ మునిపుంగవులూ—

శ్రీ గణేశ శ్రీ గణేశ
శ్రీ గణేశ పాహిమాం !
జై గణేశ జై గణేశ
జై గణేశ రక్షమాం ! !—

అంటూ ఆవేశంగా భజనలు చేస్తున్న సంగతి తెలిసి, ప్రభువు మరింత ఉగ్రుడయ్యాడు. ఫలితంగా, వాళ్లకి శిక్షలు మరింత కఠిన మయ్యాయి. అయితే, బాధలు పెట్టిన 'కొద్దీ వాళ్లింకా గాఢంగా భజనలూ ప్రార్థనలూ సాగించారు !

ఆ రోజున—

సింధుమహారాజు సేవకులతో 'ఎవ్వడైనా సరే, లోపలకు రానియ్యవద్దు !' అని చెప్పి ఆజ్ఞాపించాడు. తన మందిరంలో ఏకాంతంగా కూచుని, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఆ యోచనలోనే ఉస్సురుమంటూ నిట్టూర్చాడు.

అదే సమయంలో ఎవరో వచ్చారు లోపలికి !—

'ఎవరు నువ్వు ? ఎలా వచ్చావ్ ?'— గద్దించి అడిగాడు, రాజు.

అందుకు ఆ వచ్చిన వ్యక్తి :

'ఆ సంగతి తరవాత చెబుతా, ముందు నా ప్రశ్నకు జవాబు చెప్పు : నువు సామాన్యుడివి కావు. వరప్రసాదుడివి, శివభక్తుడివి. కావలసిన వరాలన్నీ సంపాదించుకున్నావు. ఏకచ్ఛత్రాధిపత్యంగా మూడు లోకాలూ ఏలుతున్నావు. బాగానే ఉంది.

కాని,—

దేవతలనూ మునులనూ యాతన పెట్టడం వల్ల నీకేం ఒరుగుతుంది ? నిరపరాధులైన వాళ్లని నిష్కారణంగా బాధ పెట్టావంటే, వాళ్ల ఉసురు నీకు తగలకుండా పోతుందా ? ఇలా చెయ్యడంతో నీ గొయ్యి నువ్వే త్రవ్వుకుంటున్నావన్న మాట.

నువ్వేం అవివేకివి కావు. అంతా తెలిసే చేస్తున్నావు. అయినా ఒక్కసారి హెచ్చరించి పోదామని వచ్చా. సుఖాన ఉండే ప్రాణాల్ని దుఃఖాన పెట్టుకోకు ! నేను పరమేశ్వరుడి వాహనాన్ని. గణేశుడి బంటును. నా పేరు నందీశ్వరుడంటారు....' అని చెప్పాడు.

కళ్లెర్రజేశాడు సింధురాజు, పటపట మంటూ పళ్లు కొరికాడు, 'ఎవరక్కడ ?— వీడి తల నరకండి ! !' అంటూ గర్జించాడు !

'మూర్ఖుడా! తొందరపడకు, ఎవరి తలను ఎవరు నరికేదీ రేపు ఉదయానికల్లా నీకే తెలుస్తుంది. నీకు మృత్యువు దగ్గర పడిందన్న సంగతి మట్టుకు మరిచిపోకు. రేపు పొద్దుటే యుద్ధానికి సిద్ధంగా ఉండు ?' అని నందీశ్వరుడు వచ్చినవాడు వచ్చినట్టుగానే మాయమయ్యాడు !

నిర్ఘాంత పోయాడు, సింధురాజు !

* * *

మర్నాడు—

యుద్ధరంగంలో సింధురాజుకు ముందుగా ప్రమథ గణాలతో కూడా నందీశ్వరుడు ఎదురయ్యాడు. రాక్షస సేనల్ని ఎడతెరిపి లేకుండా రంగం మీదికి వదిలాడు సింధురాజు, యోధులు ఎంతమంది వచ్చినా వెంటవెంటనే సమాధానం చెబుతూ వచ్చారు దేవగణాలు. రక్కసుల తలలు తెగి మేటలు మేటలుగా పడ్డాయి ! రణరంగంలో ప్రారంభమైన రక్తప్రవాహాలు నగరం లోపలికే చొరుచుకు వచ్చేశాయి !

నందీశ్వరుడి నాయకత్వం కింద నడుస్తున్న దేవతల బలాలు తన సేనల్ని అవలీలగా హతమార్చి వేయడం చూడగా, సింధురాజుకు ఎక్కడలేని పౌరుషమూ పుట్టుకొచ్చింది.

పెద్దగా ఒక్క కేకవేసి, ఒకే ఒక అంగలో ముందుకు దూసుకు వచ్చాడు ! తన వశంలో ఉన్న అస్త్రాలూ శస్త్రాలూ అన్నీ ఒక్కసారిగా గుప్పించాడు ! దేవగణాలకు ధైర్యం తగ్గింది.

ఇప్పుడు స్థితి చూడగా—

రాక్షసయోధులా చాలావరకు హతమారి పొయ్యారు. దేవగణాలా అలసిపోయి ఉన్నారు. ఈ సమయంలో దూసుకు వచ్చిన సింధురాజు కంటబడగానే ప్రతి ఒక్కరికీ హడలుచ్చుకుంది !

అయితే—

జయసింధు రంగంలోకి దిగాడనగానే గణేశుడు సైన్యాలను వెనక్కు ఉంచేసి, తనుమాత్రం ఒక్కడూ ముందుకు వచ్చాడు.

ఆ తొండమూ, బొజ్జా చూసిన సింధు, 'ఓహో, నువ్వేనా వినాయకుడంటే !' అని వికటంగా



వచ్చాడు. వినాయకుడితో శక్తివంతమైన అస్త్రశస్త్రాలు గుప్పించాడు. ఇదే సమయమని వినాయకుడు తీక్షణమైన ఐదు అస్త్రాలు ఒకేసారి ప్రయోగించాడు, అంతే !—

సింధురాజు రథమూ, సారథీ, ధ్వజమూ, అశ్వాలూ, విల్లమ్ములూ నుగ్గు నుగ్గయిపోయాయి! ఈ దృశ్యం చూసీ చూడటంతో రాక్షస సేనలు చెల్లా చెదరై పోయాయి !

మర్నాడు రెట్టింపు సైనిక బలంతో మళ్లీ వచ్చాడు సింధురాజు. రెండవ రోజూ ఓడి పోయాడు !—

ఈ విధంగా ఒకటి కాదు, రెండు కాదు— వరసగా ఇరవై రోజుల పాటు వాళ్లిద్దరి మధ్యా హోరాహోరీ యుద్ధం సాగింది ! అయినా, సింధు కొంచెమైనా వెనుకాడలేదు. గణేశుడూ వూరుకో లేదు, అతన్ని కవ్విస్తూనే ఉన్నాడు !—

ఇరవై ఒకటో రోజు !—

ఎడతెరపి లేకుండా ఇరవై రోజులు యుద్ధం చేసిన సింధురాజుకు ఈ రోజున అలసట అనిపించింది. మనసుకు విసుగు తోచింది. ఏమీ ?— తనవాళ్లంతా చచ్చారు. రాజ్యంలో మిగిలి ఉన్న యావన్మందీ— పిల్లలు మొదలుకొని పెద్దల వరకూ— అతన్ని తిట్టే వాళ్లే ?

ఈ స్థితిలో సింధురాజు వేగి పోయాడు. హృదయంలో ఆవేదన చెప్పతరం కాకుండా ఉంది. ఆఖరి మెట్టుగా అతడు వజ్రాయుధం దూసి, గిర గిర తిప్పి గణేశుడి మీద తీవ్రంగా విసిరాడు ! అయితే— అంతటి శక్తివంతమైన వజ్రాయుధాన్ని కూడా వినాయకుడు మధ్యలోనే పడగొట్టేశాడు.

తరవాత, పరమేశ్వరుణ్ని మనసులో తలుచుకుని, సింధురాజు పైన శూలాయుధాన్ని ప్రయోగించాడు !

అది తిన్నగాపోయి పోయి, జయసింధు గుండెల్లో దూసుకుంటూ పోయింది. 'గణా ! గణా ! !—' అంటూ అతడామట్టున మేరుపర్వతంలాగా నేల గూలాడు ! !—

జయసింధు శరీరంలోంచి ఒక దివ్యజ్యోతి వెలువడి, వినాయకుడిలో ఐక్యమైపోయింది ! ! !

దేవలోకం నుంచి పువ్వుల జల్లు కురిసింది ! ! !

(ఇంకావుంది)

దీపావళి కథలపోటీ

—

ఆఖరితేదీ

1-10-'64

# శ్రీవారితో సినిమాకి

11 వ పేజీ తరువాయి

లేక మూలి మున్నని ఎత్తు మడమలని వేసుకొని దానితో యాతన పడుతూ ఒక మూల నడవ లేకుండా వుంటే, "అలాంటప్పుడు ఎవడు వేసుకో మన్నాడు?" అని శ్రీవారు సణుగుతో వుంటే, మరో మూల రోడ్డు మీద ప్రేక్షకులు హాస్యం మొదలెడితే ఏడుపొస్తుంది.

సినిమా హాలులో కూర్చున్నాక, సినిమా ప్రారంభమై రకరకాల రసవత్తరాలతో నడిచేటప్పుడు కూర్చున్న ప్రేక్షకులు కూడా రకరకాల భంగిమలతోనికి మారడం జరుగుతూ వుంటుంది. అంతా కుర్చీకి మేనువాల్చి కూర్చుంటే, తాను నిటారుగా కూర్చొని మొహం ముందుకు చాచి తీక్షణంగా చూచేవారు. అవరుసతో కొట్టొచ్చినట్లు కన్పిస్తారు. ఇక భావావేశం గూడా కల్గిందా— "చ్చొచ్చొచ్చొ" లు "అయ్యో అయ్యో" "పాపం" లాంటి సంభ్రమాశ్చర్యాలు, విషాదంతో దుఃఖం, హాస్యంతో నవ్వులువచ్చి తోటిప్రేక్షకుల్లో మనం హాస్యాస్పదులవుతాం దాంతో శ్రీవారు "ఖస్సు" మని లేస్తారు. మిగిలిన సినిమా మనకు విషాదమే.

"ఏమండీ వీడు ఫలానా గాదూ, ఇది ఆసినిమాలో నటించిందే గాదూ" అని ఆయన గార్ని సినిమా చూడనీయకుండా తమ తమ ఫిలిం పరిజ్ఞానాన్ని ప్రదర్శించి అల్లరి చేసి అల్లరి పడే వాళ్లు కొందరు.

మరి కొందరు సినిమా చూస్తూ, ఇంటి గొడవలు సినిమా చూడ్డానికి వచ్చిన ఇంకో సూరమ్మ గారి సంగతులతో, లోకాభి రామాయణంతో పడేవారు. వీరు శ్రీవారు "ఆ వెధవ గొడవలకేం — సినిమా చూడనివ్వద్దూ" అని అదలించి నప్పుడు గాని, తోటి ప్రేక్షకు లెవరయినా "మమ్మల్ని సినిమాలో మాటలు విననీయండి బాబోయ్" అన్నప్పుడుగాని జాలిగా ఊరుకో వలసి వస్తుంది.

హాలులోకి కొన్ని తినుబండారాలు ఆయిల్ పేపరులో చుట్టి లేదా పొట్లాలుగానూ వస్తాయి. అవి మోజాగా కొనుక్కొని లేదా కొనిపించుకొని సినిమా జరుగుతున్నప్పుడే గానుగ వేసే తెగ ఒకటి వుంది. ఆ పేపరు చేసే చిటపటలు, వాళ్ళ నములుతూ వుంటే వచ్చే శబ్దం పరిసరాల్లో వారికి ఇబ్బంది కల్గించక మానదు. ఇక వేరు శనగ బటానీల్లాంటి వయితే ఆ చప్పుడుకు తోడు మనం సినిమాచూచి పోయాకకూడా మనం అక్కడే కూర్చున్నట్టు సాక్ష్యం అన్నట్లు పొగయి కూర్చుంటాయి. ఒకవేళ తినాలనిపిస్తే కాయలుగా కాక గింజలు కొనుక్కోవటం బాగుంటుంది. అలాగే పేకెట్లు కూడా మూతి చింపి, దాన్ని బుల బులాగ్గా పట్టుకొని చేతిలోకి కొంచెం కొంచెంగా వేసుకొని తింటే అంత అల్లరి వుండదు. ఆ చీకటిలో మిరప కాయలు లాంటి కారం తిని ఎక్కిళ్ళ తెచ్చుకుంటే దానంత అల్లరి, హాస్యం వేరే చెప్పాలా !

ఎక్కువ ఖరీదు (బజారు ధర కంటె) తక్కువ నాణ్యము గల ఈ చవకబారు టిఫిన్లు కాఫీలు ఈ సినిమా హాళ్లలో సేవించి అవస్థపడేకంటే ఇంటి వద్దే తగినంత ఫలహారం పానీయాలూ స్వీకరించి వస్తే యాతన తగ్గించుకొన్న వాళ్లవుతారు.

అలాగే సినిమా మధ్యలో ఇచ్చే చాలీ చాలని విరామ కాలంలో ముగించుకో లేక తర్వాత చీకటిలో జనాన్ని రాసుకుంటూ, తూలుతూ, తొక్కుతూ యాతన పడేకంటే, సినిమా హాలులోకి వెళ్లే ముందో, సినిమా అయిపోయాకో అవసరాలు తీర్చుకొంటే బాగుంటుంది.

ఇక పిల్లలతో సినిమాకు వెళ్లేవారు సినిమా వూళ్లోకివచ్చి, జనం తక్కువ అన్నాక తీరుబడిగా మాట్నీకి వెళ్లినంత సుఖం మొదటి ఆట రెండవ ఆటలకి, ఎక్కువ "రష్"గా వున్నప్పుడు వెడితే వుండదు. పైగా "కుయ్యో మొర్రో" అనే పిల్లలతో రాత్రివేళ చాలా చిరాకుగా సినిమాకు వెళ్లిన ఆనందమే పోతుంది. అటు పైని (మన పిల్లల మంచి తనాన్ని బట్టి) రెండు మూడు రూపాయలు ఎక్కువగా పట్టుకొని వెళ్లడం ఎంతైనా అవసరం. ★



# సరాగమాల — వి. ఎ. కె. రంగారావు

ఒక పాఠకుని అమాయక ప్రశ్న : అయితే రంగారావుగారూ, నిజం చెప్పండి, మీరు ఏ 'రావు' వర్గానికి చెందుతారు ?

నా జవాబు : నేను ఎప్పటికప్పుడు పార్టీలు మారుస్తూంటానండీ. "బొబ్బిలి యుద్ధం" లో 'ఊయల లూగినదే', "నిను చేర మనసాయెరా" విన్న తరువాత సాలూరి రావు పార్టీ. రేపు "హరిశ్చంద్ర", "ప్రమీలార్జునీయం" లో శాస్త్రీయ గీతాలు విన్న తరువాత పెండ్యాల రావు పార్టీ. ఆ తరువాత, అంటే "పల్నాటి వీరకథ" లో పాటలు విన్నాక మళ్లీ సాలూరి రావు పార్టీ. ఇలా శాస్త్రీయ గీతాధారమై అతి చంచలంగా ఉంటుంది నా మనసు. మీరేమంటారు, అలా ఉండకూడదంటారా ?

* * *

మద్రాసు పాఠకులు 'శిష్ట్ల' కొన్ని సూచనలు చేశారు. శ్రీ గాలిపెంచల అనేక సంవత్సరాలు విత్తహీనులకు సేవ చేయుటయే కాక ఒక సంగీత గ్రంథాన్ని రచించారట కదా, దాన్ని ఇప్పటి సంగీత దర్శకులందరూ కలసి ప్రచురిస్తే బాగుంటుంది కదా అన్నది మొదటిది. నా ఉద్దేశంలో ఏ ఒక్క సంగీత దర్శకుడూ ఇంతటి బాధ్యత వహించరు. కేవలం దానికయ్యే ఖర్చు భరించలేక అని కాదు. దాన్ని భరించినా ఒక పుస్తకం ప్రసవవేదనను వారనుభవించలేరు. ఇక ఎవరైనా నమ్మకస్తులు ఈ పని తలపెడితే దాదాపు అందరు సంగీత దర్శకులూ తగిన విరాళాలిస్తారని నాకు నమ్మకం ఉంది. కాని అంత శ్రద్ధతో శ్రమ తీసుకొనే వ్యక్తి దొరకటం అంత సులభం కాదుగదా! ఆ బాధ్యత నేను నిర్వర్తించగల అవకాశమే కలిగితే నా అదృష్టం అనుకుంటాను. కాని ఎలా దొరుకుతుంది ? ఇంటింటికీ వెళ్లి ఈ పని చేయటానికి నేనే యోగ్యుణ్ణి అని చెప్పుకోవడం అంత సులభం కాదేమో! పెద్దలందరూ కూడి అలా నిర్ణయించి ఆ పని నా కిస్తే తప్పక శిరసావహించగలను.

* * *

మీ అభిమాన గాయక ముక్కామల సుమంద యిప్పుడు హైదరాబాద్‌లో ఉన్నారు. రేడియోలో అడపాదడపా పాడుతూనే ఉన్నారనుకుంటాను. సినిమాలలో ఈమధ్యన అంటే "కలిమిలేములు"లో 'కలలోని గాలిమేడ' తరువాత, ఏమీ పాడలేదు. అర్హత ఉన్నవారందరికీ అవకాశం లభిస్తుందనీ, అవకాశం లభించినవారందరికీ అర్హత ఉంటుందనీ చెప్పలేం కదా! అటువంటి విలక్షణమైన కంఠం చిత్రాలలో కనీసం అప్పుడప్పుడైనా వినిపించకపోవటం మన దురదృష్టమే. జిక్కి, రాణి, రాజా, కోమల సంగతి కూడా అదే!

* * *



ఆగస్టు 3 న రాజమండ్రి, డైరెక్టర్ ఆదుర్తిని సన్మానించింది. సన్మాన సంఘ కార్యదర్శి శ్రీ పైడి వెంకటరావు, సభాధ్యక్షుడు నాగేశ్వరరావు, ఆదుర్తి, సన్మాన సంచికను ఆవిష్కరిస్తున్న సావిత్రి గారలను పై ఫోటోలో చూడవచ్చును.

బరంపురం నుంచి శైలజా పాండే, నెల్లూరు నుంచి రామలక్ష్మి కోరిన విధంగా "పీటలమీద పెళ్లి" లో పాటలు పరిచయం చేస్తాను.

పీటలమీద పెళ్లి జి. ఇ. 35465.

మల్లాది వ్రాస్తే శృంగార గీతాలే కాదు. భక్తిగీతాలూ, హాస్య గీతాలూ అన్నీ తరగతికి తగినట్లు ఉంటాయి. పై రికార్డులో ఒకప్రక్క శ్రీనివాస్ బృందం పాడిన "అంపకాల" పాట. అంపకాల పాట మగవాళ్లు పాడట మేమిటో అనుకుంటారేమో! అసలు ఈ 'అంపటం' కూడా మగవాడినే! అయినప్పుడు మగవారు కాక మరెవరు పాడతారు! మచ్చుకు కొన్ని మాటలు.

"తిన్న తమ్ములు వంటబట్టి మన్నగా తేలావురా
పిల్లకాలం జెల్ల తింటూ చల్లగా ఉండాలిరా
ఒకటన్నా పది తిన్నా మనలో మనకు చెల్లిందిరా
దేశంమీద వెర్రి వేషాలు వేస్తే దిమ్మ తిరిగి
పోతుందిరా."

కాలేజీ కుర్రాళ్లు తమలో ఒకడిని ఇంటికి పంపేటప్పుడు పాడే ఈ పాటకు అశ్వత్థామ సరదాగా ఖవాలీ పద్ధతిలో వరస చేశారు. సినిమాలో పాట చివరన ఉన్న శహానాలో ఉన్న ముక్క కూడా రికార్డులో ఉంటే మరికొంచెం బాగుండును.

రెండవప్రక్క సుశీల సోలో గీతం. ఇదీ మల్లాది వ్రాసినదే. నిజం చెప్పాలంటే ఈపాట మొదటి మారు వినటానికి, అదీ సినిమా చూస్తున్నప్పుడయితే, అతి సాధారణంగా ఉంటుంది. కాని, సావకాశంగా ఒకటి,రెండు మార్లు మళ్లీ వింటే ఈ పాటలో ఏదో వింత అందం ఉందనిపించక మానదు. అశ్వత్థామ వరస అంత లలితంగా సుశీల పాడటం అంత రసభరితంగా, వాద్యగోష్ఠి మృదుశబ్ద సంకలితంగా ఉండటం ఇది మొదటిసారి కాదు. కాని ఇంతటి ఉత్కృష్ట సృష్టి ఎన్నిమార్లు విన్నా ఇంకా వినాలనే ఉంటుంది. వాద్యగోష్ఠిలో వాయులీనాల మేళవింపూ, సుశీల గళాన కొంగ్రొత్త సంగతుల పల్లవింపూ గమనించదగ్గ అందాలు.

రచనలో రమ్యతకు వుదాహరణలు :—

"గగనాన మొయిలూ అలాగే ఉండేనా
కమ్ముకున్న ఆపదా కాపురం చేసేనా
ఎండలే పండబారి వెన్నె లభ్యేమునే
ఎన్నికైనవాడా మన మేక మయ్యేమునే."

పీటలమీద పెళ్లి జి. ఇ. 35466.

చెరువు ఆంజనేయశాస్త్రి ప్రతిభావ్యుత్పత్తులున్నా అరుదుగా సినిమాకోసం పాటలు వ్రాస్తున్న వ్యక్తుల్లో ఒకరు. వారి రచనే పి. బి. శ్రీనివాస్ వసంత పాడిన యుగళ ప్రణయ "పిల్లా, రసగుల్లా, రాజా బాలరాజా" గీతం. మాటల పేర్పు, అలంకారాలకీ వృత్త్యనుప్రాసం అంటారనుకుంటాను. బాగా, తేలిగ్గా, తేమగ్గా ఉంది. "వలపులగని తన ప్రియుని గని, పలికింది రజని, పులకరించింది తరుణి,"

"నాగవుల సరి, కడు సొగసరి తాళ్ళపాక. ... పరిగతి. కాని చిత్రమేమిటంటే ... తిరుపతి ... ... కాదు తారకు పుర్కారి ... భానుమతి, ఎంత మురచింది మందరి."

వరప వరదాగా, సులభంగా మొదటి ప్రేమానుభాగంలో చేయబడి వదిలా ఉన్నది. అర డజను వాద్యాలతో అరవయి పాడిన ప్రభావం కలిగించగలిగిన అశ్వత్థామ స్తోమతు తెలుస్తూనే వుంది. వసంతా శ్రీనివాసుల కలయిక జయనీ, సిరీకలంటుకలాగానే వుంది.

రెండవ ప్రక్క "సూర్యునికి జాబిలికీ చుక్క ఎదురయ్యే" అనే విషాద గీతం. మల్లాది రచన శ్రీనివాస్ పాడినది. ఈ పాటలో ప్రత్యేకత అంతా వాద్యానుసరణలో ఉంది. "పాటధారి" మరో వైకల్యాన్ని సూచించే సన్నాయి లీలలు అశ్వత్థామకు సి.రామచంద్ర అంటే ఉన్న గౌరవాన్ని తెలుపుతున్నవి. అటూ ఇటూ వున్న ఆ ఆకార్డియనులు, బాంగోడ్రమ్స్ పాశ్చాత్య ధోరణిలో అతి చక్కగా అమర్చబడ్డవి. పంజరా నున్న కోకిల కంఠం లాగా శ్రీనివాస్ గాత్రంలో విషాదం లీలగా, అవలీలగా గోచరిస్తున్నది. విని కొనదగిన పాటలు పై నాలుగూ.

* * *

అప్పుడప్పుడు, ఎవరైనా అప్పుడే పరిచయం కాబడ్డవారు అటుంటారు. మీ రచనలు 'ప్రభ'లో చదువుతుంటాము అని. వారి మతిమరుపుకీ, అమాయకత్వానికీ నవ్వు వస్తుంది. లేదండి నేను వ్రాసేది పత్రికలో అని నెమ్మదిగా చెప్తాను. ఈ మధ్యన ఒక పరిత ఉత్తరమే 'ప్రభ' కార్యాలయానికి వ్రాశారు. అక్కడనుంచి పత్రిక ఆఫీసుకివచ్చి అక్కడనుంచి నాకు వచ్చిందనుకోండి. అది వేరే సంగతి. కాని చిత్రమేమిటంటే తిరుపతి ... వ్రాసిన లేఖలో 'సరాగమాల'లో చదివిన అంశాలగురించి 'ఇప్పుడే చదివాను. ఉండబట్టలేక వెంటనే వ్రాస్తున్నాను'అనికూడా వ్రాశారు.మరి. ఆ తొందరలో పొరపాటు జరిగిందేమో మరి.

* * *

తిరుపతినుంచి 'రాగ్స' వ్రాసిన లేఖ. "రంగా రావుగారూ, వచ్చినప్పుడంతా కలుసుకోవాలను కుంటాము. కాని ఒక్కమారూ వీలుపడలేదు. ఎన్నో రోజులుగా ఒక్క సందేహంమాత్రం నన్ను పీడిస్తోంది. పాటల వరసలు కూర్చటంలో పాడే వాళ్లకు ఏమయినా, జోక్యం ఉంటుందా! నిర్మొహమాటంగా చెప్పగోరుతున్నాను"

ఏదో విషయం చెప్పటానికి నాకు మొహమాటం ఎందుకూ ! నేపథ్యగాయకులు సర్వ సాధారణంగా వరసలో మార్పులు చెప్పరు. తమ సౌకర్యాన్ని అనుసరించి శ్రుతి మార్చుకుంటే సార్థమంటారు. కాని ఈ సంగతి సంగీత దర్శకునికి ముందే తెలిసి వుంటుంది. కాబట్టి ఇది అంత తరచుగా జరగదు. ఇక సంగతులు కొన్ని కంఠాలలో పలక్కపోతే, పలికినా బాగుండకపోతే, పాడేవాళ్లూ మార్చమని అడుగుతారు. విషయం పసిగట్టేస్తే సంగీత దర్శకులే అడగకుండానే మార్చేస్తారు. కొంతమంది సంగీతకారులు పాట ఒకటిరెండు మార్లు వినిపించి వారినే తోచిన సంగతి ఒకటి రెండు చోట్ల వేయమనడం కూడా కద్దు. "పరువుప్రతిష్ఠ"లో, "ప్రభుగిరిధారి" సంగీతంలో సౌందర్యంలో కొంత భాగం పెండ్యాలది మరికొంత భాగం పాడిన సుశీలది.

... వరలక్ష్మి, శాంతకుమారి, వీరిలో భానుమతి ప్రతి పాటకు వరస చేసేటపుడు సంగీత దర్శకులతోబాటు కూర్చోవడం, ఇలా ఉంటే బాగుంటుందనడం మామూలే, నాగేశ్వరరావైనా, రాజేశ్వరరావైనా ఆమె సూచనం ప్రకారం ఆలోచించటానికి అనుమానించరు. ఆమకు తోచినదే బాగుందనిపిస్తే చెప్పడానికి జంకరు. ఈ ఇద్దరు సంగీత దర్శకులకు,ఆమెకు పరస్పర గౌరవ ప్రపత్తు లెక్కువ. వరలక్ష్మి, శాంతకుమారి పాటలలో ఇంత జోక్యం కలుగ జేసుకోరుకాని ఇలా మారిస్తే బాగుంటుందని తోస్తే తప్పక చెప్తుతారు. విషయం తెలిసినవారికి (శాంతకుమారి ఒకప్పుడు విద్యాలయాలలో సంగీతబోధిని) వారు చెప్పినదానిలో సబబే కనిపిస్తుంది సబబైన సంగీతకారునికి.

* * *

'సరాగమాలకి' భానుమతి స్పెషల్ న్యూస్ కావాలని స్టాంపులు పంపేవారు యికమీదట పంపవద్దని మనవి. ఇంతవరకూ స్టాంపులు పంపినవారు 'స్పెషల్ న్యూస్' పొందే వుంటారు.

7—8—64 సంచికలో 11, 48, పేజీలలో కార్టూన్‌లు వేసినవారు, 14—8—64 సంచికలో 47వ పేజీలో కార్టూన్ వేసినవారు తమ పూర్తి చిరునామాలు వ్రాయ ప్రార్థన — సంపాదకుడు.

# పొదుపులోనే భద్రత వుంది
# మీదీ. మీ దేశానిదీ కూడా!

## "ఓవోమాల్ట్ నా నృత్యానికి దోహద మిస్తోంది"
### అని అంటోంది పద్మిని

"భరత నాట్యంలో తాళానికి అనుగుణంగా వేసే అడుగులు. హృదయాన్ని కవ్వించే అభినయమూ. చురుకైన కదలిక – ఇవన్నీ మిమ్ములను ఉల్లాసపరచి ఆనందంతో ఉవ్విళ్లూరిస్తాయి.




అయితే. ప్రతి నృత్య ప్రదర్శనానికి అంతకుముందు చేసే సాధనకి ఎంత సత్తువ అవసరమో మీకు తెలుసా? సరిక్రొత్తది. పుష్టికరమైనది అయిన గ్రానులర్ ఓవోమాల్ట్ త్రాగనిదే నేను నా కార్యక్రమ భారాన్ని సక్రమంగా నిర్వహించలేను. ఓవోమాల్ట్ సత్తువను ఆరోగ్యాన్ని ప్రసాదించే కోకో. విటమిన్లు. బార్లీమాల్ట్ మరియు అప్పటమైన పాలతో తయారై కమ్మని సువాసనతో. పోషక పదార్థాలతో సులభంగా జీర్ణమవుతుంది ..పగలంతా పడ్డ కష్టాన్ని పోగొట్టి గాఢనిద్ర కలిగించడంలోకూడా తోడ్పడుతుంది".




సరిక్రొత్త పుష్టికరమైన గ్రానులర్

# ఓవోమాల్ట్

పోటిలేని ఆహారపానీయం.

పుడ్స్ ఫ్యాట్స్ & ఫెర్టిలైజర్స్
ప్రైవేట్ లిమిటెడ్
67, గొడౌన్ వీధి, మద్రాస్-1.
తణుకు రోడ్, తాడేపల్లిగూడెం,
ఆంధ్ర ప్రదేశ్.



# సినీమా వార్తలు

## వి. యస్. ఫిలింస్

### "భక్త రామదాసు"

వి. యస్. ఫిలింస్ వారు నిర్మిస్తున్న "భక్త రామదాసు" చిత్రం తిరిగి షూటింగ్ ప్రారంభించారు. ఈ మధ్య "వోరక్కాడు" గ్రామం (మద్రాసుకు 24 మైళ్ళ దూరం)లో ఔట్‌డోర్ చిత్రీకరణ జరిపారు. ఈ షూటింగ్‌లో రామదాసు అతని భార్య కమలతో గ్రామగ్రామం తిరిగి భద్రాచలంలో శ్రీరామ దేవాలయం నిర్మాణానికి విరాళాలను వసూలు చేసే పాట నొకదానిని, మరొకటి రామదాసు భద్రాచలానికి తహసిల్దార్‌గా అయిన తర్వాత వరుణ దేవుని ప్రార్థించటం చిత్రీకరించారు. ఇందులో నూరుమంది జూనియర్ ఆర్టిస్టులు కూడా ఉన్నారు.

ఈ చిత్రానికి నిర్మాత, సంగీత దర్శకుడు, దర్శకుడు : శ్రీ వి. నాగయ్య, ఈ చిత్రంలో మహమ్మద్‌రఫీ కొన్ని పాటలను పాడినట్లు తెలుస్తుంది.

## వినాయక్ ఫిలింస్ 'భక్తమీరా'

వినాయక్ ఫిలింస్ అనే నూతన సంస్థవారు "భక్తమీరా" అనే చారిత్రాత్మక భక్తి రస చిత్రాన్ని నిర్మించేందుకు గాను ఒక పాటను, మూడు శ్లోకాలను రికార్డ్ చేశారు.

"చిన్నికృష్ణుని చిలిపితనాలు విన్నారా ఓ చెలులారా !"

పై పాటను యస్. జానకి బృందం పాడగా రికార్డ్ చేయబడింది. ఒక శ్లోకాన్ని పి. బి. శ్రీనివాస్, యస్. జానకి పాడగా రికార్డ్ చేశారు. మిగిలిన రెండు శ్లోకాలను పి. బి. శ్రీనివాస్ పాడగా రికార్డ్ చేశారు. ఈ చిత్రానికి సంగీత దర్శకునిగా ఏ. ఏ. రాజా— శ్రీ కేల్కార్ పర్యవేక్షణ క్రింద పై పాటకి సంగీత బాణీని కూర్చి భరణీ స్టూడియోలో రికార్డ్ చేసినట్లు తెలుస్తుంది.

## విజయభట్ మూవీస్

### "తోడూ - నీడా"

విజయభట్ మూవీస్ వారు నిర్మిస్తున్న మొదటి చిత్రానికి "తోడూ—నీడా" అని నామకరణం చేశారు. ఇది వారి ప్రథమ చిత్రం, సాంఘికంలో నిర్మిస్తున్నారు. ఆత్రేయ వ్రాసిన—

"ఎన్నో రాత్రులు వస్తాయి" అనే పాటను భానుమతి పాడగా రికార్డు చేశారు. త్వరలోనే ఈ పాటను శ్రీమతి భానుమతితోనే చిత్రీకరిస్తారు. భానుమతి ఈ చిత్రంలో మూడు పాటలను పాడుతుంది. కథానాయకుడుగా యన్. టి. రామారావు నటిస్తారు. వీరుగాక ఇంకా జమున, యస్. వి. రంగారావు, రమణారెడ్డి, గీతాంజలి, నాగభూషణం, నాగయ్య మొదలగు వారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి సంభాషణలు : సముద్రాల (జూనియర్) పాటలు : ఆత్రేయ, సంగీతం : కె. వి. మహదేవన్, ఛాయ : యం. కె. రాజు, కళ : యస్. కృష్ణారావు, కూర్పు : టి. కృష్ణ, నిర్మాత : యస్.



" అగ్గిపిడుగు"లో రామారావు, రాజనాల



'హమ్ దీవానే'లో హెలెన్



'షెహనాయ్' చిత్రంలో రాజశ్రీ

యస్. భట్ అండ్ ఏ. రామిరెడ్డి, దర్శకుడు : ఆదుర్తి సుబ్బారావు.

# సినిమా వార్తలు

## "బొబ్బిలి యుద్ధం"

రాజనగరంలో బుస్సీ మకాం.

"హైదర్‌జంగ్, ధువాసీ లక్ష్మన్నలు విజయ రామరాజువద్దనుండి లంచం పుచ్చుకొని, బొబ్బిలి వారిమీదికి బుస్సీని ఉసికొలుపుతున్నారని—వారి స్థితులను పూర్తిగా తెలుసుకొని న్యాయంగా వ్యవహరించడం భావ్యమని తెలుపుతూ బందరులోవున్న ఫరాసు అధికారి గిరుందొర ఒక వర్తమానాన్ని బుస్సీకి మార్టిన్ ద్వారా పంపుతాడు. బుస్సీ ఆ లేఖను చదువుతాడు.

"మార్టిన్! అంతా ఫైల్ చేసినాం— యూ కెన్ గో—...." మార్టిన్ వెళ్ళిపోతుండగా, అతనికి హైదర్‌జంగ్ ఎదురవుతాడు. బందరునుండి ఏదో వర్తమానం వచ్చిందని హైదర్ అవగాహన చేసుకుంటాడు.

"మఛిలీసే క్యా ఖబర్ ఆయా సర్కార్?

"వాట్ సర్కార్?......బొబ్బిలిమీద యుద్ధం చేయడానికి రాజావారి దగ్గర ఎంత లంచం తిన్నావ్?

"లంచం! హాం, లంచం తిన్నాం?"

"యస్. నమ్మకద్రోహం, బేవకూఫ్ పని చేసినావ్!

"మై బేవకూఫ్.....మై నమ్మకద్రోహం.....బూ ...ర్కార్! మై మొరాసిన్ దొరసైజీ రంగారావు దగ్గర లంచమ్ లచ్చల్ లఖంకొట్టి మీకి సిఫారస్ చేయడానికి మై హైదర్‌జంగ్ హూ! మై ముసల్మాన్ హూ!.....గుల్బర్గా దెబ్బకు మద్దతు ఇచ్చాం ఓనగిరి యుద్ధంతో సాయం సేశాం. వల్గొండ నొమ్మికి హిమ్మత్ పుర్వాం. మానవాబ్ సలాబత్ జంగ్ బహద్దర్‌కి, మీకి తకరార్ వస్తే ముసల్మాన్ చోడ్‌కె మీ తరఫ్ బందోబస్తు సేశాం—ఏ హైదర్‌జంగ్ బద్మాష్‌హువా ఏ బడా ముసల్మాన్ బేకార్ హువా!.....హిదీ మాట ఇంకోడు చెప్పివుంటే వాడ్కి తల కొబ్బరి చిప్పలాగ లేపించి ఉంటాం. వాడ్కి దుమ్ము దుమ్ము సేసిఉంటాం లేకిన్ ఆప్ బోల్దియా ఎంత కోపరమ్, లేహాయా నాకి సేసేకంటే, జంగల్‌మే ఆకూ హాలం తింటాం తిజియే తల్వార్—"

"హైదర్!......ఆగు"

"నై సర్కార్—నై—మీకి, మాకి దోస్తీ ఖతం."

"హైదర్‌జంగ్! ఏమిటీ తొందర?"

"మెహర్బానీ కర్కె ముఝే జానే దీజియే"

"హౌ హ్యూమన్ యూ ఆర్!—మాటలు కూడ యుద్ధం మాదిరి చేస్తావ్!......మొరాసిన్, రాజావారి యుద్ధంలో పడి వద్దని వార్నింగ్ ఇచ్చినాడు— నీకు హుషార్ చెప్పినాము—ఎందుకు ఇంత గలాటా చేస్తావు. సిట్‌డవున్......ప్లీజ్ సిట్ డౌన్."

"మేం చెప్పేదంతా మన మంచికే సర్కార్.... ఇలంరాజ్కి పెద్ద సైన్యం ఉంది. గట్టి రాతి కోట ఉంది. నిజాంకి పెష్కష్ ఇచ్చిన బడారాజా.....మనం కాదంటే గోల్కొండ పోతాడ్......"

"యస్.....యస్......"

ఈసన్నివేశం రిపబ్లిక్ ప్రొడక్షన్సువారి "బొబ్బిలి యుద్ధం" చిత్రంలోనిది. దీనిలో బుస్సీగా ముక్కామల, హైదర్‌జంగ్‌గా యం. ఆర్. రాధా (తమిళ నటుడు రాధా మొదటిసారిగా తెలుగులో ముస్లిమ్ వేషం వేయుట ఇదే ప్రథమం.) చిత్రానికి సంగీతం యస్. రాజేశ్వరరావు, ఛాయ కమల్‌ఘోష్, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, నిర్మాత సి. సీతారాం.

## గౌరి ప్రొడక్షన్స్ నెం. 3.

మణిపుర మహారాజు కామపాలుడు తన రాణి రాగవతితో ఒక వెన్నెల రాత్రి ఆనందంగా గడుపుతుంటాడు. రాణి తన సంగీతంతో మంత్రముగ్ధుణ్ణి చేస్తుంది.

చల్లచల్లగా సోకింది. . . . .
మెల్ల మెల్లగా తాకింది. . .

జీవమనే సితారపై రవ్వసేయగా, గా-
తీయగా

గిలిగింతలు పెట్టింది అల్లరి చిరుగాలి కవ్వించి నవ్వించి. . ఆశని ఆకలకు సంకెళ్లు వేస్తుంది. . . పాటలు చాలించి మాటలకు దిగారు సరసులిద్దరూ. . . .

"రాణీ!"

"ఊఁ!"

"అడుగడుగునా ఆనందంలో పండిన పదవి కంటే, అణువణువునా అమృతం చిందే ప్రియురాలి పెదవి మేలు. అందుకే పడతి పొందు కోసం రాజ్యాలను, ప్రాణాలనూ కూడా ధారపోస్తారు, ప్రేమికులు."

"ఊఁ !"

"ఊఁ ! రాజ్యంతో బాటు అపురూపమయిన అనురాగ సామ్రాజ్యం కూడా మాకు లభించింది. ఈ పరవశం మాకు శాశ్వత వరం కావాలి. వెన్నెల కౌగిలి, సదా మాకు స్వాగతం పలకాలి. ఈ ఆనందం అనంతమై, జీవితాంతం, మన మిలాగే ఉండిపోవాలి."

"జీవితంలో మేము కోరేది ఇదొక్కటే !"

"రాణీ!"

"రాణీ! ఎందుకలా నవ్వుతావ్ ?"

"నిదురలో అనవలసిన మాటలు మెలకువతో అంటూంటే, మాకు నవ్వొచ్చింది."

"అంటే !. . . ."

"ఈ యువ్వనమే శాశ్వతం కానప్పుడు, ఈ ఆనందం మాత్రం మనకు జీవితాంతం ఎలా వుంటుంది ? ఇప్పుడు నవ్వించి కవ్వించే ఈ యౌవ్వనమే, తరువాత మనల్ని నవ్వులపాలు చేస్తుంది. వృద్ధాప్యం అనే [illegible] కావలివానికి అప్పజెప్పి, మన శరీరాన్ని పెళ్లివారు విడిచి వెళ్లిన విడిదిలా చేసి మరీ వెడుతుంది. అప్పుడు అనుభవాలూ అనుభూతులూ తప్ప. ఈ అందాల్లో యే ఒక్కటే మనకు మిగలదు మహారాజా !"

"కాదు. మన ప్రేమకు వృద్ధాప్యం లేదు; రాదు."

"ఈ వయస్సులో అందరకూ అలాగే అనిపిస్తుంది. పాలుకారే చెక్కిళ్లు పాలిపోయినప్పుడు, మోహం కలిగించే మోము ముడుతలు పడినప్పుడు కవ్వించే కన్నులు, కాంతి విహీనమైనప్పుడు, తనువులో జిగి బిగి తగ్గినప్పుడు, ఈ నాటి అందాలరాణి ఈ రాగవతి కూడ, మీ కంటికి అప్పుడు వికృతంగానే కన్పిస్తుంది."

"వీల్లేదు. ఏనాటికీ వికృతంగా ఉండటానికి వీల్లేదు. వృద్ధాప్యం మనకు రాకూడదు."

"ఆ అదృష్టం, ప్రకృతికి తప్ప మానవులకు లేదు మహారాజా ! పుట్టిన ప్రతివ్యక్తి యువ్వనంతో బాటు ముసలితనం కూడా అనుభవించాలి."

"కాదు. దీనికేదైనా నివారణోపాయం ఆలోచించాలి. వృద్ధాప్యం రాకుండా యువ్వనం పోకుండా చేయగలశక్తి యేదైనాసరే? ఎక్కడున్నా సరే, సంపాదించి తీరాలి !"

ఈ సన్నివేశం గౌరీప్రొడక్షన్సు వారి ప్రొడక్షన్ నెం. 3 లోనిది.

ఈ చిత్రానికి రచన : పీటూరి, సంగీతం : కోదండపాణి, ఛాయ : హెచ్.ఎస్. వేణు, నిర్వహణ : యస్. భావనారాయణ.

## యస్. ఎన్. ఏ. పి. వారి
## "బ బ్రు వా హ న"

బలదేవుడు తన చెల్లెలు సుభద్రను సుయోధనునికిచ్చి వివాహం చేయాలని నిశ్చయించుకుంటాడు. శ్రీకృష్ణుడు తన అన్నకు ఎదురాడకుండా మౌనం వహిస్తాడు. కాని చెల్లెలి మనసు అతనికి తెలుసు. ఆమె హృదయం పార్థుని కర్పితమయిందని ఎరిగి శ్రుతి మించి రాగాన పడక ముందే జాగ్రత్త పడమని అర్జునునికి శ్రీకృష్ణుడు హెచ్చరిక చేస్తాడు.

అర్జునుడు సన్యాసి రూపంలో ద్వారకానగరం ప్రవేశిస్తాడు. శ్రీకృష్ణ బలరాములు అతనికి స్వాగతమిచ్చి తోటలో బసయేర్పాటు చేస్తారు. .

స్వామికి సపర్యలు చేయుటకు బలదేవుడు సుభద్రను నియమిస్తాడు. . . . సపర్యంకై వచ్చిన సుభద్ర, పార్థుని యోగక్షేమములు తెలుసుకోదలచి సన్యాసిని ప్రశ్నిస్తుంది. . . . వారి సంభాషణ పద్యాల రూపంలో తెలుస్తుంది.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, కాంతారావు, రేలంగి, చలం, పేకేటి, వంగర, మిక్కిలినేని, యస్. వరలక్ష్మి రాజసులోచన, యల్. విజయలక్ష్మి, జయంతి మొదలగువారు నటిస్తున్నారు.

ఈచిత్రానికి మాటలు—పాటలు—పద్యములు—దర్శకత్వం: సముద్రాల రాఘవాచార్య, సంగీతం : పామర్తి, ఛాయ : కమల్‌ఘోష్, కళ : తోట, నృత్యం : వసుమర్తి, ప్రొడక్షన్ ఇన్‌ఛార్జి : చిట్టిబాబు, స్టూడియో, విజయా, వాహిని, నిర్మాత : పి. జ మోహనరావు.

—సి. ధర్మారావు.



'గౌరి ప్రొడక్షన్స్ నెం. 3' లో జయంతి

## భారీయెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

# అవీ - ఇవీ - అన్నీ

కాకినాడ మెడికల్ కాలేజీ పీడియాట్రిక్స్ ప్రొఫెసర్ డా. గోపాలస్వామి దిగుమర్తి; ఆగస్టు 21 వ తేదీన— జకార్తాలో జరగనున్న 2 వ ఆఫ్రో ఆసియన్ పీడియాట్రిక్స్ కాన్ఫరెన్సులో ఇండియన్ అకాడమీ ఆఫ్ పీడియాట్రిక్స్ తరఫున పాల్గొనే నిమిత్తం మద్రాస్‌నించి వెళ్లారు.

## అల్లురామలింగయ్యకు సన్మానం

హాస్య నటుడు శ్రీ అల్లు రామలింగయ్యకు ఇటీవలనే, గుంటూరులో నటరాజ ఎమెచ్యూర్స్ ఆర్ట్ థియేటర్స్ వారి వార్షికోత్సవ సందర్భంలో సన్మానం జరిగింది. కుమారి ఇందుమతి స్వాగత నృత్యంతో కార్యక్రమం ప్రారంభమయింది. రంగస్థల నటులు శ్రీ మందపాటి రామలింగేశ్వరరావు సభను ప్రారంభించారు. జిల్లా కలెక్టరు శ్రీ వి. శ్రీనివాసాచారి అధ్యక్షత వహించారు.

సమాజం దర్శకులు శ్రీ కె. రంగారావు తమ సంస్థ యొక్క కార్యకలాపాలను స్థూలంగా సమీక్షించారు.

అనంతరం, కార్యదర్శి శ్రీ యం. వి. యల్. నరసింహారావు శ్రీ రామలింగయ్యను పుష్పమాలాలంకృతుల్ని చేసి, నూతన వస్త్ర, సన్మాన పత్రంతో ఘనంగా సత్కరించారు.

సన్మానితుడు శ్రీ రామలింగయ్య సముచితరీతిన సమాధానమిస్తూ, వారు లోగడ నటించిన కొన్ని చిత్రాలలోని సన్నివేశాలను రసవత్తరంగా ప్రదర్శించారు.

హితశ్రీ రచన 'విచిత్ర జీవులు' నాటక ప్రదర్శన, ఇతర వినోద కార్యక్రమాలతో ఆ నాటి సభ ముగిసింది.







య డ వి ల్లి ర వ

## అవీ - ఇవీ - అన్నీ

### వి వా హం

షావుకారు జానకి, కృష్ణకుమారి గారల సోదరుడైన చి. రాఘవేంద్రరావుకూ, అహమ్మదాబాదు వాస్తవ్యులైన శ్రీ కోటి కాంతారావుగారి పుత్రిక చి. సౌ. చందా పరమేశ్వరికి ఆగస్టు నెల 16 తేదీన మద్రాసులో వైభవంగా వివాహం జరిగింది. 17 వ తేదీన ఆతిథ్యం ఏర్పాటు చేశారు. అనంతరం కుమారి ఇందిర నృత్య ప్రదర్శనం, శ్రీ పి. బి. శ్రీనివాస్ పాటకచ్చేరి, శ్రీ కాశీనాద్ తాతా 'మిమిక్రీ' తదితర వినోద కార్యక్రమాలు జరిగాయి. ఈ వివాహ మహోత్సవానికి ఫిలిం పరిశ్రమకు చెందిన పలువురు కళాకారులు, దర్శకులు, నిర్మాతలు, ఇతర స్థానిక పెద్దలు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు.

*   *   *

వ్యవసాయశాఖలో సూపరింటెండెంటుగా పని చేస్తున్న శ్రీ గురప్పడి వెంకటసుబ్బయ్యగారి కుమారుడు చి. సత్యనారాయణమూర్తికి డాక్టరు పెద్దూరు సంజీవరాయశర్మగారి కుమార్తె చి. సౌ. సత్యవతీదేవికి ఆగస్టు 12 న ప్రొద్దుటూరులో వైభవంగా వివాహం జరిగింది. ★




Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone; 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'దాగుడు మూతలు'లో బి. సరోజాదేవి, రామారావు